పై వారమే

# సంక్రాంతి సంచిక!

దీపావళి కథల పోటీలో
బహుమతి పొందిన రచయితల పరిచయం

**పాఠకుల బాలట్ ఫలితాలు**
**బహుమతి పొందిన వ్యాసాలు**

★

## సినిమా బాలట్

★

శతచిత్ర నటుడు మురళీమోహన్

## సంక్రాంతి సరదాలు

★

సినీనటుడు రంగనాథ్ కథ

## చేతిలోని ఏ రేఖా చెప్పలేకపోయింది

★

మాతన్ప్రసాద్ అనుభవాలు

## మరపురాని సంక్రాంతి

★

కృష్ణ, శోభన్‌బాబులు చెప్పిన

**కొత్త సంవత్సరంలో కొత్త సంగతులు**

★

పెద్ద కథ

## పెన్ ఫ్రెండ్

ప్రారంభం!

**ప్రత్యేక కార్టూన్‌లు, కవితలు, వ్యాసాలు**

ఎక్కువపేజీలు ❀ వెల : రూపాయిన్నర




### ముఖచిత్రం.

భరతనాట్యమాడు, వయ్యారి నటిభామ
'రాజ్యలక్ష్మి' కొమ్మ—రంగు బొమ్మ
ఏమి భావమమ్మ ?—ఎందరి కది కమ్మ?
ఆంధ్రపత్రికందు— అట్టబొమ్మ

డాక్టరు సమ్మెట శ్రీనివాసరావు (విశాఖపట్నం)

*　*　*

నటి జి. రాజ్యలక్ష్మి ముఖ చిత్రముతో 25—12—81 వ తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక, అత్యంత ఆకర్షణీయంగా ఉంది.

బి. జంగమయ్య (సోంపేట)

### కథలు

25—12—81నాటి పత్రికలోని కథ "కథ నిజమైతే ?" మమ్మల్ని ఎక్కువ ఆకట్టుకుంది. ముఖ్యంగా నేటి ప్రస్తుత కాలంలో ప్రవేట్ మేనేజిమెంటులో జరిగే కాలేజీస్ అవక తవకలు, ఎలాంటి ఇబ్బందులు విద్యార్థులు ఎదుర్కొంటున్నారో ఈ కథ తెలియచేసింది.

**ఎం. పద్మావతి, ఎం. సాయిగణేష్, పి. వి. వరలక్ష్మి (సంపర)**

*　*　*

25—12—81 నాటి, పత్రికలో 'గణపతి వెడుతున్నా సెందాలివ్వండి' కథ చాలా బాగుంది.

'కథ నిజమైతే' చాలా చక్కటి నీతిని తెలియచేస్తుంది. ఇలాంటి సంఘటనలు ప్రతి ప్రైవేట్ కళాశాలల్లో జరుగు తున్నవే.

యు. యు. ఉరుక్కుందు [ఎమ్మిగనూరు]

*　*　*

25—12—81 సంచికలోని కథలలో కథ నిజమైతే? చాలా బాఫుంది. కథకు "అమర్ మోహన్" వేసిన "బొమ్మ" కూడా బాగా నూటయింది. ఇది కథ అనడం కన్నా ప్రస్తుత సమాజంలో నిజంగా జరుగుచున్న గాథ అంటే బాఫుంటుందేమో ?

విజేంద్రనాథ ప్రసాద్ (ఆదోని)

*　*　*

"గణపతి వెడుతున్నా, సందా లివ్వండి" "బలిపీటం" కథలు బాగున్నాయి.

హరిత (లాల్‌దర్వాజ)

(66 వ పేజీ చూడండి)

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకులు :
[1938 1972]

శుక్రవారం : 15–1–'82
దుర్మతినామ సం. పుష్య బ. షష్ఠి
సంపుటము 75 : సంచిక 19

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

✻

పోస్టుతో ఏడాది చందా రు. 67–60
ఆరు మాసాల చందా రు. 33–80
విడిప్రతి వెల రు. 1–25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయానుక్రమణిక



## లోకంపోకడ ✻ ఊమెన్









# జోస్యం

బుద్ధరాజు సన్యాసిరాజు

ఆఫీసు పని తొందరగా అయిపోవడంతో డ్రాయర్ను లాక్ చేసుకుని పోబోతున్నాం. ఇంతలో –

'శ్రీ మహాంకాళీ, అంబా, భగవతీ'అంటూ కొండరాజు హడావుడిగా లోపలికొచ్చి,

"ఈరోజు అంబవలికింది ... రీడింగు ఖచ్చితంగావస్తాది" అన్నాడు. అంటూ సరాసరి మేనేజరు రూములోకి దూరి, అయన్ని బలవంతాన ఒప్పించి, కుడిచెయ్యందుకుని భూత, వర్తమాన, భవిష్యత్సంఘటనలు ఏకరువు పెట్టాడు. భూత, వర్తమానాలు ఖచ్చితంగాచెప్పాడన్న నమ్మకం కుదిరిందేమో, అయన అమాంతం సీట్లోంచి లేచి, కొండ రాజుతో 'షేక్‌హేండ్' చేసి అతను చెప్పిం దానికి ప్రతిఫలంగా ఓ అయిదు రూపాయల నోటు తీసి యివ్వబోయారు. వాడు నసేమిరా అది పుచ్చుకోలేదు. కాని, మా మేనేజరు సంతకంతో ఓ 'ఒక్కి మొని' ఇవ్వమని అడిగి, పుచ్చుకున్నాడు.

డోరుదగ్గర నిల్చున్న మమ్మల్ని ముగ్గుర్నీ పిల్చి, చెయ్యి చూపించుకోమన్నారు మేనేజరు గారు.

నాకు, మూర్తికి వాటిమీద నమ్మకంలేక సీతాపతికి సైగచేశాం. వాడు సంకోయిస్తుంటే –

"ఏంనోయ్ సీతాపతి ! సిగ్గుదేనికయ్యా ! చాలా బాగా చెప్తున్నాడు ... పెళ్ళిగావల్సిన వాడివి ... చెయ్యి చూపించుకో" అన్నారు మేనేజరుగారు.

మేనేజరు గారన్నారని మొహమాటం తోనో, ఏమీ పుచ్చుకోకుండా చెప్తున్నాడన్న కుతూహలంతోనో, లేక నిజంగాచెప్పించుకోవాలన్న ఉద్దేశంతోనో సీతాపతి కుడిచెయ్యందించాడు కొండరాజుకి.

"పై రెండు కళ్ళా పక్కన పెట్టు" అన్నాడు కొండరాజు.

కళ్ళద్దాలు తీసి పక్కనుంచాడు సీతాపతి.

"నా కంటి పాపల్ని సూటిగా చూడు"

వాడూ వీడూ ఓ నిముషం చూసుకున్నారు.

"ఈ నౌకరీలో కొత్తగా చేరినావు"

"అవును."

"నీయమ్మ పెద్దన్న పెద్దకూనకి నీమీద మనసుంది. నీకూ యిష్టమే. గాని ఆ సిలక ఇంకా నీ గూటికి సేరలేదు."

"అవునవును"

"నీ మానవ కానుగలోడు. నీ పిట్ట మూలంగా నీకు లక్ష్మికళ వుంది. గంపెడు కానుల్తో నీకాడ వాల్తది."

తనకి మామగారు అడ్వాన్సుగా యిచ్చిన మోటారు సైకిలు, ఇవ్వబోయే కట్నం గురించి తల్చుకున్నాడేమో–

"అవును... అవో... అలాగా" అన్నాడు గొణుగుతున్నట్టు.

"నీకు సిన్నతనంలో రెండు గండాలు దాటిపోయాయి. ఒకటే బొగ్గుబండి గండం, రెండోది జలగండం..."

తను హైస్కూల్లో చదివే రోజుల్లో సొంతవూరు వెళ్తూ, ఆగబోతున్న రైలు నుంచి ఆత్రంగా దిగబోయి కాలుజారి బారెడు దూరాన ప్లాట్‌ఫాం మీద పడడం, అక్కడి జనం తనని అమాంతం తనని ప్రక్కకీడ్చి పట్టాల కిందికి వెళ్ళకుండా కాపాడడం లీలగా గుర్తొచ్చిందిట. అలాగే దసరా శలవులకి తన ఈడు వాళ్ళతో చెరువులో స్నానం చేస్తుండగా ఈతరాక మునిగిపోవడం, తనతో పాటు స్నానానికొచ్చిన వాళ్ళు బయటికి లాగి రక్షించడం ...

'ఫ్లాష్ బాక్'లో కనిపించిందిట. అదే చెప్పి–

"కరెక్ట్, కరెక్ట్" అని కేకేసాడు.

"ఇంకా నీకో గండం వుంది. అది రోడ్డు గండం. దగ్గర్లోనే వుంది" అన్నాడు కొండ రాజు, తన జోస్యం నమ్ముతున్నారన్నఫోజులో.

"అంటే ఏంత దగ్గర్లో?" గొంతులో తడి లేనట్టుగా వుంది, ఆ మాటలు బయటి కొచ్చిన తీరునుబట్టి.

"ఎంత దగ్గర్లో అంటే ఏట్టా సెప్పి సచ్చేది ? ఊ...ఇది దీపావళి అమావాస కదా, ఇంకో రెండుమూడు అమావాసల్లోపల ... ఊ... రెండు చక్రాల మోటారు బండివల్ల ప్రమాదముంది."

ఒక్కసారి డీలాపడిపోయాడు సీతాపతి.

"ప్రమాదమే మైనా ఉందా ?" అన్నానేను వాడి అవస్థను గ్రహించి.

"ఓయబ్బ...ప్రమాదంలేకుండా ప్రెమాదమని ఏందుకంటాం ? ప్రెమాదమంటే ప్రెమాదమే ... కాని, ప్రాణానికి భయం లేదు"...

భారంగాలేచాడు సీతాపతి. వాడి వెనకాలే నేను, మూర్తి వెళ్తుండగా కొండరాజు చెప్తున్నాడు–

"...ఆ గండం గడిసిన తర్వాత బాబుకి రాశి తిరుగుతాది. పెద్ద లెవెలు కెల్తాడు... పెళ్ళి చేసుకుంటాడు."

ఇది సీతాపతి వినిపించుకున్నట్టులేదు. హెల్మెట్ చంకలో పెట్టుకొని నేరుగా గేటు దగ్గరకు వెళ్ళిపోతున్నాడు.

* * *

స్వతహాగా భయస్థుడు సీతాపతి. ఓసారి వాడు చేసేపనిలో చిన్నతప్పు జరిగిందని ఏకౌంటెంటు గట్టిగా చివాట్లేస్తే దానికే రెండ్రోజులు జ్వరంపెట్టుకున్నాడు. చాలా సెన్సిటివ్ ! ప్రతివిషయం అనవసరంగా, ఎక్కువగా ఆలోచించి బుర్ర పాడుచేసుకుంటాడు. కాని చాలా తెలివైనవాడు. ఆఫీసులో చేరి రెండు సంవత్సరాలైనా కాలేదు, డిపార్టుమెంటులో పరీక్షలన్నీ కట్టి మొదటి ఛాన్సులోనే పాసయ్యాడు.

ఈ మధ్యనే ఆఫీసర్సు సెలెక్షనుకి కూడా వెళ్ళొచ్చాడు. వాడు సెలెక్టవుతాడని ఆఫీసులో అందరికీ నమ్మకం.

అసలిదంతా ఏందుకు చెప్పవలసి వచ్చిందంటే, ఆ జోస్యం గురించి మూర్తి, నేను

అసలు పట్టించుకోలేదు. కానీ సీతాపతి విషయంలో అది పూర్తిగా విరుద్ధమైంది. ఆ మర్నాటి నుంచి వాడు ఆఫీసుకు ఎలా వచ్చేవాడో, ఎలా వెళ్ళేవాడో ఎవ్వరికీ తెలీదు. ఆఫీసులో మొత్తం పదిహేనుమంది కొలీగ్స్ ఉన్నా, మూర్తితోనూ, నాతోనే చాలా చనువుగా వుంటాడు మిగతా వాళ్ళతో రోజుకో మాట మాట్లాడటం కూడా అపురూపమే.

ఆ రోజు నుంచీ మాతో కూడా సరిగ్గా మాట్లాడటం లేదు. సీట్లో కూర్చుని దేవదాసు పాటలు ఖూనీరాగాలు తీస్తున్నాడు. గడ్డం గియ్యటం లేదు.

ఎప్పుడూ లేంది అప్పుడప్పుడు దమ్ము కొడుతున్నాడు. టైమవగానే ఎవ్వరికీ విష్ చెయ్యకుండా వెళ్ళిపోతున్నాడు ఓ రోజు నేనూ, మూర్తీ వాడి విషయం తేల్చుకోవా లనుకున్నాం

"ఒరేయ్ సీతా... ఏవిట్రా రోజురోజుకీ మరీ అలా తయారౌతున్నావ్? విషయం ఏంటో మాకు చెప్పకూడదా?" అన్నాడు మూర్తి.

"... ... ... ..."

"మీ ఇంటి దగ్గర్నుంచేమైనా ఉత్తరం వచ్చిందా?" అడిగాన్నేను.

"... ... ... ..."

"నీ 'వుడ్‌బి' నిన్ను చేసుకోనని రాసిందా?" అని ఛలోక్తి విసిరాడు మూర్తి.

మూర్తి మీద చిరాకు పడ్డాడు సీతాపతి–

"అన్నీ తెలిసుండి అడ్డమైన ప్రశ్న లేస్తారేంరా"– అంటూ.

"సారీ... ఆ మాత్రం దానికే ఇలా బెంగ పెట్టుకుంటావేంట్రా."

"మీకేంరా బాబూ. మీకేం చెప్పలేదుగా వాడు. అంచేత ఎన్ని కబుర్లయినా ఆడతారు ఆ రోజు నన్ను బలవంతంగా వాడి ముందుకు తోసారు, అన్నీ కరెక్టుగా చెప్పాడు మరి ఇది నమ్మకుండా ఎలా వుంటాం?".

"అవున్రా బాబ్జీ. జ్యోతిష్కులంతా భూత వర్తమానాలు కరెక్టుగా చెప్తారు. గాని, భవిష్యత్తు ఎవడూ సరిగ్గా చెప్పలేడు. భవిష్యత్తు గురించి వాడు చెప్పింది నమ్మడానికే ముందు జరిగినవీ, జరుగుతున్నవీ జాగ్రత్తగా చెప్తారు. అంచేత నువ్వు దాన్ని గురించి మనసు పాడుచేసుకోనక్కర్లేదు అయినా చదువుకున్నావు, జ్ఞానం వున్న



వాడివి, ఇంత మూర్ఖంగా నమ్మి, అంత డీలా పడిపోవడం తప్పుకాదూ? దీని గురించి ఎక్కువగా ఆలోచించకుండా వెళ్ళి శుభ్రంగా రెస్ట్ తీసుకో. రేపు మళ్ళీ దేవదాసులా గెడ్డంతో వచ్చావంటే ఒప్పేదిలేదు'' అని చివాట్లేసాము.

తరవాత అదీ ఇదీ అని నచ్చచెప్పి ఇంటికి పంపేసాం.

మర్నాడు ఆఫీసుకొచ్చిన సీతాపతిని చూసి మూర్తీ నేనూ ఆశ్చర్యపోయాం. ట్రిమ్ముగా ఉన్నాడు. ఈల వేసుకుంటూ వచ్చి సీట్లో కూలబడ్డాడు. మా యిద్దరికీ వాడిలోని మార్పుకి చాలా సంతోషం వేసింది. వాడిని మార్పుగలిగిన మా ప్రతిభకి మేమే జోహార్లు అర్పించుకున్నాం. ఇద్దరం వాడిదగ్గరకెళ్ళాం కబుర్ల కోసం.

''హమ్మయ్య! నిన్నటితో నా బెంగ తీరి పోయింది గురూ. ఇంక నిశ్చింతగా వుండొచ్చు'' అన్నాడు సీతాపతి.

''అదే చెప్తుంగదా మూర్తీ, నేనూ. అయినా అంత మూర్ఖంగా నమ్మితే ఎలా సీతాపతీ.''

''అమ్మమ్మా...నమ్మకపోతే ఎలగూరూ. ఏదో ఆ కొండరాజు మంచోడు గాబట్టి ఉన్న విషయం మొహమాటం లేకుండా చెప్పి, నన్ని ఆపదనుంచి రక్షించాడు. లేకపోతే మోటార్ సైకిలు గండం అని నాకు తెలిసేదా? నేను దాన్నుంచి తప్పించుకోగలిగే

# జోస్యం

వాడినా! వాడి దయవల్ల ముందుగా తెలిసింది. గాబట్టి పీడ వదిలించుకున్నాను.''

మేమిద్దరం అయోమయంగావింటున్నాం. మళ్ళీ సీతాపతే అన్నాడు—

''వారం రోజులనుంచీ ట్రై చేస్తే ఆఖరికి నిన్న సెటిలయింది గురూ. ఏడువేల రూపాయల కిచ్చేసున్నాను... ఈ రోజే డబ్బిచ్చి తీసికెళ్తానన్నాడు బండి.''

''ఏంటీ నీ మోటారు సైకిలే! ఆర్నెల్లయినా కాలేదు, తొమ్మిది వేలు పోసి కొన్నాడు గదయ్యా నీ మొగం. ఇప్పుడాయనకి తెలియకుండా రెండు వేలు తక్కువకియ్యాల్సినంత గాబరా ఏమొచ్చింది?'' అని నిలేసాను నేను.

''భలేవాడివే. ప్రాణం కంటే రెండు వేలు తీపా? బతికుంటే బలుసాకుతిని బతకొచ్చు. అందుకే నష్టం గురించి ఆలోచించలేదు. ఉదయం ఆఫీసుకొస్తూ 'ఆటో' వాడితో మాట్లాడాను. ఉదయం ఆఫీసుకి తీసుకొచ్చి సాయంకాలం రూముకి తీసుకెళ్ళడానికి నెలకి నూరు రూపాయలకి ఒప్పుకున్నాడు. ఆటో మూడు చక్రాల బండి గదా... నాకున్న గండం రెండు చక్రాల బండివల్ల అన్నాడు గదా. అదీ గూడా రెండు మూడు నెలల్లోనే అన్నాడు గదా, అంచేత ఓ నాలుగు నెలలకి ఆటో మాట్లాడేసాను. ఇంక ఏ భయం లేదు – హాహా... ఎలా వుంది మన బుర్ర?''

''పిచ్చి కుదిరింది, రోకలి తలకు చుట్ట మన్నాట్ట నీలాంటి వాడే. నువ్వేదో బాగు పడ్డావని మేం అనుకుంటుంటే, ఇదేమిటి? అయినా చాదస్తాలకీ, నమ్మకాలకీ ఒక హద్దుండాలా... వీడు ఈ జన్మలో బాగుపడడు, పద'' అంటూ మూర్తి నన్ను బయటికి లాక్కొచ్చాడు. ఇద్దరం సిగరెట్ల కోసం సుబ్బయ్య కొట్టు కేసి దారితీసాం.

*　　*　　*

సుమారుగా ఇరవై రోజులు మామూలుగా గడచిపోయాయి. సీతాపతిగాడు మాతో ఎక్కువగా కలియడంలేదు. మేం కూడా వాడితో అంటీ అంటనట్టుంటున్నాం

ఓ రోజు నేను ఆఫీసుకొచ్చి మేనేజరుకి విష్ చేద్దామని వెళ్ళేసరికి మూర్తితో సహా స్టాఫంతా అక్కడే ఉన్నారు. మేనేజరు నన్ను చూసి—

''రావోయ్ రాజూ... నీ కోసమే చూస్తున్నాం... మన సీతాపతి రాత్రి నైట్ షో సినిమా చూసుకుని ఆటోలో వస్తుండగా ఏదో ఏక్సిడెంటయిందట. వెంటనే రాయపేట ఆస్పత్రిలో జాయిను చేసారట... దెబ్బలు తగల్లేదట గాని షాక్ వల్ల అప్పుడప్పుడు స్పృహ పోతోందట. ఆస్పత్రి నుంచి ఎవరో ఫోన్ చేసారు. ఏమీ గాబరాలేదని చెప్పారు. అయినా అందరం ఓ రెండు మూడు బాచెస్‌గా వెళ్ళి చూసొచ్చేస్తే బాగుంటుంది'' అన్నారు.

హుటాహుటిన మేనేజరుగారు, నేను, మూర్తి, మరో ఇద్దరు కలిసి టేక్సీలో బయలుదేరాం.

మేం వెళ్ళేసరికి స్పృహలోనే వున్నాడు సీతాపతి. మమ్మల్ని చూసి భోరున ఏడ్చాడు.

ఏం చెయ్యాలో, వాడికెలా నచ్చచెప్పాలో బోధపడలేదు. కొంచెం సేపు వుండి, వాడు తేరుకున్నాక—

''ఏరీ సారీరా... అసలింతకీ ఎలా జరిగింది?'' అన్నాను.

''పైలట్‌లో 'ది కార్' సినిమా చూసి బయటి కొచ్చేసరికి వర్షం పడుతోంది. ఇంతలో మా కంట్రాక్టు ఆటోవాడు కనిపించాడు. వాడూ నేనూ టీ త్రాగి, దమ్ము కొట్టుకుని ఆటోలో బెయల్దేరాం థియేటర్






దాటి పోలీస్‌స్టేషన్ టర్నింగు తిరుగుతుండంగా ఓ మోటారు సైకిలు స్పీడుగా, ఎదురుగా ఆటోమీది కొచ్చింది... దానిలైటు నా కళ్లల్లో పడి నాకేమీ కన్పించలేదు... తర్వాతేమైందో గుర్తులేదు... అదుగో అతనే ఆటో డ్రైవర్... వాడికి తెలుసు ఏం జరిగిందో '' అన్నాడు.

అప్పుడతన్ని ప్రక్కకి తీసికెళ్లి అడిగాం మూర్తీ, నేనూ, ఏం జరిగిందని.

''ఆ లైటు నా కళ్లలో కూడా పడి నాకూ ఏమీ కన్పించలేదు సార్! షడన్ బ్రేకు వేసాను. స్పీడు, టర్నింగు, వర్షం ఇవన్నీ కలిసి షడన్ బ్రేకు వేసేసరికి ఆటో బోల్తా పడింది సార్...ఇద్దరం చెరోపక్కా ఎగిరిపోయాం. నేను తేరుకుని చూసేసరికి బాబుగారి చుట్టూ జనం మూగారు. దగ్గరకుపోయి చూస్తే బాబుగారికి తెలివి లేదు. వెంటనే ఓ యిద్దరి సాయంతో ఆటో ఎత్తి బాబుగారిని ఆస్పత్రిలో జాయిన్‌చేసాను. భగవంతుడి దయవల్ల ఎవరికీ ప్రమాదం లేదు.'' అన్నాడు ఆటో డ్రైవర్.

''ఉత్తి భయస్తుడు. ఉదయం ఎన్ని గంటలకు స్పృహ వచ్చింది?'' అన్నాడు మూర్తి.

''ఉదయం ఆరు గంటలకు తెలివొచ్చిందండీ. తెలివి రాగానే నన్ను చూసి 'ఎక్కడ ఉన్నాం' అన్నారు సార్ నాకు ఈయన ఇంత భయస్తులని తెలియక, తెలివొచ్చిందన్న ఆనందంలో 'ఆస్పత్రిలోనే ఉన్నాం బాబూ, ఏమీ భయం లే'దన్నాను. అది విని ఏడ్చారు. వొళ్ళంతా వణికింది... మళ్లీ తెలివితప్పింది. తరవాత ఇప్పుడే తొమ్మిది గంటలకు తెలివొచ్చింది సార్. రాగానే ఆఫీసుకు ఫోను చేసి మీ యిద్దర్నీ రమ్మని చెప్పమన్నారండి. అలాగే చేసాను'' అన్నాడు.

> **ఇది కొలబద్ద కాదు**
>
> కాశ్మీరు కళ్లతో
> దేశాన్ని చూడకు
> సాలార్జంగ్ మ్యూజియంతో
> చరిత్రని కొలవకు
>
> — అలిశెట్టి ప్రభాకర్

వాడి దగ్గరకెళ్లి ఏదో నచ్చచెప్పి, మళ్లీ ఓ గంటలో వస్తానని చెప్పి, మూర్తిని అక్కడే వుండమని చెప్పి, మిగతా నలుగురం ఆఫీసుకొచ్చేసాం.

నేను సీటుకు వెళ్లి, పాడ్ తీసి, లీవ్ లెటర్ వ్రాయబోతున్నాను ఇంతలో మేనేజరు గారో గావుకేక వేసారు—

''రాజా... గుడ్ న్యూస్... అర్జంట్... తొరగా రా'' అని. ఆతృతగా వెళ్ళాను.

''గుడ్ న్యూస్ రాజా... మన సీతాపతి ఆఫీసరుగా సెలక్టయినట్టు హెడ్డాఫీసునుంచి ఈ రోజు పోస్టులో వొచ్చింది. పేస్ ఆఫ్ ఎపాయింట్‌మెంట్ తర్వాత తెలియపరుస్తామన్నారు. వాడి దుంపతెగ... ఏమి జోస్యం చెప్పాడయ్యా ముండాకొడుకు, అక్షరం ముక్క పొల్లుపోలేదు'' అన్నారు, చెవ్వులదాకా నవ్వి.

నాకు నవ్వాలో ఏడవాలో తెలియలేదు.

వాడికి చెప్తే ఆనందంలో మళ్లీ మూర్ఛపోతాడేమోనని భయంవేసి చెప్పాలా, వద్దా అని ఆలోచిస్తూ నిలుచుండిపోయాన్నేను.

* * *

మూడో రోజున డ్యూటీలో జాయినయ్యాడు సీతాపతి.

స్వస్థతగా ఉన్నాడు.

మధ్యాహ్నం ఓ కానిస్టేబుల్ వచ్చాడు రాయపేట పోలీస్టేషన్నుంచి. సీతాపతి గురించి వాకబుచేసి వాడి దగ్గర కొచ్చి—






బులుసు వేంకటరమణయ్య

# స్థిరమైన ప్రేమ?

ప్రేమ అనేక విధములు. పిన్నల యెడ గల ప్రేమ వాత్సల్యం. పెద్దల యెడ ప్రేమ గౌరవం. భార్య యెడల ఉండునది అనురాగం. భగవంతుని యందుగల ప్రేమ భక్తి. ఇన్ని విధాల ప్రేమలలో ఏది ఉత్కృష్టమై, శాశ్వతముగా ఉండునదో గమనించవలసి యున్నది.

పిన్నలయెడ ప్రేమ వుండడం సహజం. కాని వారు చెడ్డ పనులు చేయడం వల్ల, ధిక్కరించడం వల్ల వారియందు ఉండే వాత్సల్యం తగ్గిపోవడం, కొన్ని సందర్భాల్లో పూర్తిగా పోవడం సంభవిస్తుంది. ఉవిద ప్రసవ వేదన పడుతున్నప్పుడు— "ఈ సంతానం ఎందుకు వచ్చింది?" అని తోచవచ్చును అప్పుడు లేని ప్రేమ, సంతానం కలిగిన తర్వాత బిడ్డపై అధికంగా కలుగుతుంది. పెద్దల యెడల మనకు గౌరవ మున్నప్పటికీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అపకారం కలిగిన యెడల ఆ గౌరవం తగ్గిపోతుంది. తమకు కలిగే కష్టాలకూ, అపకారాలకూ వారు కారణం కాకపోయినా— వారిపై అనుమానం కలిగితే— వారియందుండే గౌరవం నశించిపోతుంది.

ఇక— దంపతుల ప్రేమ ఎట్టిదో చూడండి. దంపతులకు తొలుత పరస్పరం ఉండే ప్రేమ సంతానం కలిగిన తర్వాత తగ్గుతూ వుండడం సహజం. ఆ ప్రేమలో కొంతభాగాన్ని సంతానం స్వీకరిస్తుంది! బిడ్డల సంఖ్య పెరిగిన కొద్దీ వారిపైనే ప్రేమ కేంద్రీకృతమవుతుంది. భార్యా భర్తల మధ్య కలతలు ఏర్పడి, కలహాలకు దారి తీయడం జరుగుతుంది. కొన్ని సందర్భాలలో విడాకులు పుచ్చుకోవడం, ఆత్మహత్యలు, హత్యలు జరుగుతూ వుండవచ్చునని పత్రికలలోని వార్తల వల్ల మనం గ్రహించ గలుగుతున్నాము. భార్యా భర్తలలో పరస్పరం విభేదాలు లేకపోయినా వీరిలో ఏ ఒక్కరైనా ద్వితీయ వివాహం చేసుకోవలసి వచ్చినపుడు వెనుకటి ప్రేమ ఆ నూతన వ్యక్తి మీదికి బదిలీ అవుతుంది. ఈ విధంగా లోకంలో వుండే ప్రేమ చలించే ప్రభావం కలదేకాని స్థిరమైనది కాదని స్పష్టమవుతూనే వున్నది. కాగా— స్థిరముగా ఉండే ప్రేమ భగవద్విషయకమైనదే! కొందరు భగవంతుణ్ణి భర్తగా ప్రేమిస్తారు. కొందరు తండ్రిగా ప్రేమిస్తారు. కొందరు సగుణునిగాను, కొందరు నిర్గుణునిగాను పూజించి సేవిస్తారు. ఏ మార్గంగా ప్రేమించినా ఆ ప్రేమ శాశ్వతమైనదేగాని చలించేది కాదు. అందువల్ల భగవంతుని గురించిన భక్తి రూపమైన ప్రేమయే యథార్థమైన ప్రేమ అని, అదియే అత్యుత్తమమైనదని గ్రహించవలసి యున్నది.

"సార్! అయ్యగారు సాయంకాలం అయిదు గంటలకి అమర్సోపేట స్టేషనుకు రమ్మన్నారు" అని చెప్పాడు.

వాడు గాబరా పడుతుంటే ప్రక్కనే ఉన్న నేను 'విషయమేమి'టని అడిగాను.

"ఏంలేదుసార్. అసలు మాకు ఇన్ఫర్మేషన్ లేకుండా ఈయన్ని ఆసుపత్రి వాళ్ళు డిశ్చార్జి చెయ్యకూడదు. ఏమీ లేదుగదా ఫరవాలేదని ఈయన అడ్రసు తీసుకొని వదిలేసారట. కాని, ఆ మోటారు సైకిలాయనపై కేసు రిజిస్టరు చేసాంగదండీ. అంచేత బండి స్టేషన్లోనే వుంది. ప్రమాదమేమీ జరగలేదని ఈయన స్టేట్‌మెంటు ఇస్తే బండి వదిలేస్తాం. సాయంకాలం ఆయన గూడా వస్తాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

## హాస్యం

పని తొందరగా ముగించుకొని, సాయంకాలం నాలుగు గంటలకు బయలుదేరాం స్టేషనుకి.

స్టేషను బయటే ఆటో వాడు కనిపించాడు. వాడిమీద చిరాకేసి— "ఏమయ్యా కేసు పెట్టినట్టు మాకు చెప్పలేదేం?" అనడిగాను.

"ఈ గొడవలు మాకు మామూలే సార్. మిమ్మల్ని ఇరికించడమెందుకని ఊరుకున్నాము. గాని ఎస్సైగారు ఒప్పుకోలేదట. అసలు నేను కేసు పెట్టలేదండి. ఆ రోజు పడిపోయిన తరవాత నేను లేచి గుడ్డలు దులుపుకుంటుంటే ఒక పోలీసాయన తెల్లకాగితం మీద నా సంతకం తీసుకున్నాడు. నా ఆటో నెంబరు కూడా రాసుకున్నాడు... పోలీసోళ్ళని కాదని మేం బతకలేం సార్. అందుకని తప్పింది కాదు" అన్నాడు.

తరవాత నలుగురం స్టేషన్లో కెళ్ళాం ఎస్సైని కలుద్దామని.

"అదుగో సార్ ఆ బండే మిమ్మల్నిన్ని కష్టాలు పెట్టింది" అంటూ గోడవారగా స్టాండువేసి, కొంచెం దుమ్ముపట్టి ఉన్న ఒక మోటార్ సైకిల్ని చూపించాడు.

ఆ మోటార్ సైకిల్ని చూసిన మేం ముగ్గురం నోళ్ళు తెరిచి, అవాక్కయిపోయాం...

అది సీతాపతి [అమ్మివేసిన] మోటార్ సైకిలే!!

అద్భుతమైన క్రొత్త సాధనం!



# ఈగిల్ కోసీ టీ-పాట్ వుంటే చాలు, రోజంతా టీ, కాఫీ త్రాగే అనుకూలమే మరి!




| మోడల్ | గైషా | ఎక్స్‌ప్రెసో | గార్సోం | మైత్రే | న్యూ వార్డ్ |
|---|---|---|---|---|---|
| పరిమాణం | 8 కప్పులు | 4 కప్పులు | 2 కప్పులు | 5 కప్పులు | 8 కప్పులు |

కాఫీ, టీ తయారు చేయడం ఎంతో బాదర బందీతో కూడిన పని. మళ్లీ-మళ్లీ పాలను వేడిచేయడం, పడకట్టిన టీ, కాఫీ పొడిని పడేయడం, కరగడం, కుడపడం— ఇవన్నీ ఎంతో విసుగు కలించే పనులు. ఇప్పుడు ఈగిల్ కోసీ టీ-పాట్స్ మళ్లీ-మళ్లీ టీ, కాఫీ తయారు చేసే ఈ బాదర-బందీని తొలగిస్తాయి. ఒక్కేమారు తయారు చేసి ఇందులో పోసి వుంచుకొంటే చాలు, ఎన్నో గంటలపాటు రుచికరమైన తాజా టీ, కాఫీ హాయిగా అనుభవించవచ్చు. ఈగిల్ టీ-పాట్స్‌తో రోజంతా ఎప్పుడు కావాలన్నా వేడి-వేడి కాఫీ, టీ తయార్!

ప్రత్యేకమైన లోపలి వాక్యూమ్ ఫ్లాస్క్ రీఫిల్ మీ కాఫీ, టీలను పొగలు కక్కేలా వేడిగా వుంచుతుంది.



## ఈగిల్ కోసీ టీ-పాట్. ఎన్నో గంటల పాటు వేడిగా వుంచుతుంది






15-1-1982 శుక్రవారం మొదలు
21-1-1982 గురువారం వరకు

మేషం : రాశికి కేంద్రంలో చేరిన రవి సర్వ విధాలా మేలు చేయనున్నాడు. ఉద్యోగవృత్తులందు అభివృద్ధి, కొందరకు క్రీడారంగంలో అవకాశాలు లభించనున్నవి. గృహ విస్తరణ కార్యక్రమం చేపట్ట నున్నారు. వస్తు సేకరణకు, వాహన లాభానికి అవకాశం గల వారం. స్త్రీలకు : శుభకార్యా లోచనలు. సుఖ సంతోషాలకు లోపం లేని వారం.

వృషభం : మిత్రులనో, ఆత్మీయులనో, బంధు వర్గీయులనో, హితులనో కలిసికోగలరు. శుభకార్య నిమిత్తం ఏవో సంప్రదింపులు సాగించ గలరు. బంధుకోటిలో ఒకానొకరి సంబంధం నిశ్చ యించ అనువయిన వారం. ఉద్యోగంలో, వ్యాపా రంలో వికాసమున్నది. స్త్రీలకు : నానావిధాలా మేలు చేకూరనున్నది. ఆదాయంగల వారమే.

మిథునం : మీతో సహకరించే వారున్నారు. వారితో సహ సోదర ప్రియులు ఉంటారు. కొని కొనుగోలు చేయమని వత్తిడి చేసే వారుంటారు. ప్రయాణం చేయవలసిన పరి స్థితులు ఏర్పడగలవు. సాగించితే ఉత్తమమే. వస్తువులు ఏవో కొనుగోలు చేయనున్నారు. స్త్రీలకు : సుఖశాంతులు, కించిత్తు ఆదాయం సంభవం.

కర్కాటకం : మీకు గల చాకచక్యం రచనా విధానంలోనే అయితే నూతనావకాశాలు లభించ నున్నవి. అలాకాక మీకు వ్యాపారమే ముఖ్య వృత్తి అయితే, నూతనంగా కొన్ని వస్తువులు కొని, అధిక లాభాలకు అమ్మ ప్రయత్నం చేయనున్నారు. అధికారులను, చుట్టు ప్రక్కల వారిని గమనించి మెలగటం ఎంతయినా శ్రేయస్కరం. స్త్రీలకు వస్తుసామగ్రి సేకరణకు. ఉన్నత విద్యార్థులకు అవకాశం గల వారం.

సింహం : ప్రతివారం ఒకేలాగు ఉంటుంది అని అనుకోవద్దు. మీకు ఏదయినా వ్యవహారం పరిష్కరింపదగినది ఉంటే ఈవారం నిశ్చయంగా, సానుకూలంగా, లాభదాయకంగా అనుకూలంగా, ఆదాయపూర్వకంగా పరిష్కరింపబడగలదు. ఒకా నొక శుభ కార్య విషయంలో గురు గ్రహం అను కూల ప్రదాయకుడుగా ఉండగలడు. స్త్రీలకు : అన్ని రంగాలలో వృద్ధి. ఆదాయంలో అభివృద్ధి గల వారం.

కన్య : ఎదుటివారి, ఎటి ఉద్దేశ్యాల మనసును గమనించి మెలగాలి. ప్రసంగసమయాల యందు, బ్యాంకులందు, సినిమాలందు, కార్యాలయాలందు ఉద్యోగించే వారికి మేలు చేకూరగల వారం. వయసు

# మహిళాలోకం ముందడుగు



శ్రీమతి ఇందిరాగాంధి
ప్రధానమంత్రి

"తరాలుగా ఆర్థిక స్వేచ్ఛకుగాని, విద్యా గ్రంథానికిగాని నోచుకోని కోట్లాది మహిళల జీవన పరిస్థితులు మెరుగుపరిచేందుకు మనం కృషి చేస్తున్నాం. తమలో అంతర్లీనంగా ఉన్న మహత్తర శక్తిని వారు తెలుసుకుని తమ ప్రతిభను పెంపొందించుకొని జాతి అభివృద్ధి కృషి చేయాలని మనం భావిస్తున్నాం."



శ్రీ టి. అంజయ్య
ముఖ్యమంత్రి

★ మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిగారి ఈ ప్రపంచ మహిళా సంక్షేమ రంగంలో మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల విధానాన్ని వెల్లడి చేస్తున్నది. మన రాష్ట్రావతరణ రజతోత్సవాల సందర్భంగా శ్రీమతి ఇందిరాగాంధి పుట్టిన రోజును మహిళా దినోత్సవంగా మనం జరుపుకోవడం మన కెంతో గర్వకారణం.

★ మహిళలకు ఒక ప్రత్యేక ఆర్థిక సంస్థను ఏర్పాటు చేసిన మొట్టమొదటి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్. ఇంతవరకు 42,000 మంది బలహీన వర్గాల మహిళలు స్వయం ఉపాధి పథకాలు చేపట్టి ఈ సంస్థ ద్వారా ప్రయోజనం పొందారు.

★ హైదరాబాదులో ఉన్న దుర్గాభాయ్ దేశ్‌ముఖ్ మహిళా సాంకేతిక శిక్షణ సంస్థ యువ మహిళలకు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంలో శిక్షణ యిస్తున్నది. వెల్లూరులో కూడా ఇటువంటి సంస్థ ఒకటి ఏర్పాటు చేస్తున్నారు.

★ విశాఖపట్నం, హైదరాబాదు, తిరుపతిలలో ఉద్యోగాలు చేసే మహిళల కోసం, వసతి గృహాలు నిర్వహిస్తున్నారు. స్వచ్ఛంద సంస్థలు నిర్వహిస్తున్న ఇటువంటి వసతి గృహాలకు సహాయాన్ని అందజేస్తున్నారు.

★ చిత్తూరు, హైదరాబాదులలో వృద్ధులకోసం రెండు వసతిగృహాలు నిర్వహిస్తున్నారు

★ రాష్ట్రంలో 18,000 మహిళా మండలలు పనిచేస్తున్నాయి.

★ మహిళల కోసం వృత్తి శిక్షణ కేంద్రాలు, సర్వీసు గృహాలు, టైలరింగు సెంటర్లు, చేతి పనుల శిక్షణ కేంద్రాలు, యూనిఫారం దుస్తుల తయారీ కేంద్రాలు, ఆశ్రయ గృహాలు పనిచేస్తున్నాయి.

★ మన ప్రధానమంత్రి ఆశయాలకు అనుగుణంగా ఆంధ్రప్రదేశ్‌లో మహిళా లోకాన్ని జాగృతం చేసేందుకు తగిన కృషి జరుగుతున్నది.

Advt No.88

సమాచార పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము, హైదరాబాదు. DIPR No. 52428/Advt-1/C8/81-

## వారఫలం

మీరిన వారికి హఠాత్తుగా ఆరోగ్యం భంగం కావచ్చు. జాగ్రత్తపడాలి. వస్తువులు ఏమైనా పోగొట్టుకొంటారేమో జాగ్రత్త! స్త్రీలకు: ఉద్యోగ తృప్తి. కుటుంబ ఆనందానికి ఎలాంటి లోపం లేదని గ్రహించాలి.

తుల : బంధు విరోధం కొని తెచ్చుకొన్నట్లవుతుంది. శుభకార్యాలకు అడ్డంకులు రాగలవు. ధనాదాయానికి మాత్రం ఏ విధంగా లోటు లేదని గ్రహించాలి. వ్యాపారాలోచనలు ఫలించుటకు పెద్దగా అవకాశాలు లేవు. క్రయవిక్రయాలు ఆపుకోవాలి. స్త్రీలకు: సర్వరంగాలలో అభివృద్ధి సూచనలున్నాయి.

వృశ్చికం : ఆరోగ్య లోపం లేదు. అధికారుల మన్నన సుఖశాంతులకు అవకాశముంటుంది. వ్యాపారం చేసే వారయితే, మిత్రుల మూలాన లాభదాయకం. భారీ వ్యాపారమయితే బహు జాగ్రత్తగా వ్యవహరించాలి. స్త్రీలకు: వృత్తి వ్యాపారాలలో అభివృద్ధి, ఒకానొక విషయంలో మేలు చేకూరే మార్గమున్నది.

ధనుస్సు : మీ వ్యాపారం సాగుతుంది. ఆలోచనలు ఫలవంతమవుతవి. నిర్మాణ కార్యక్రమములో శ్రద్ధ అతిశయించుట చేత, కార్యక్రమం సక్రమంగా నెరవేరుతుంది. లాభదాయక వారమే. ధనాదాయానికి ఉద్యోగంలో చాల విధాల అనుకూలత ఏర్పడుతుంది. స్త్రీలకు : సుఖశాంతులు, కళారంగాలలో అభివృద్ధి. క్రీడావనీ మేలు గల వారం.

మకరం: నూతన విషయాలను తెలిసికొనటకు, నూతన వస్తుసేకరణకు, క్రయవిక్రయాలకు, కళారంగంలో అధికాదరణకు అనుకూలతకు ఆదరణకు, ధనలబ్ధికి, ఇచ్చిన ధనాన్ని సేకరించుకొనుటకు ఇదొక అనుకూలవారం. స్త్రీలకు: రచనా వ్యాసంగం ఫలించుటకు, సినీ రంగంలో అవకాశాలు లభించుటకు, కళారంగ ఖ్యాతికి అనుకూలమే.

కుంభం : చిత్రరంగ నిర్మాతలకు, గాయనీ గాయకులకు, వైద్య వృత్తిలోని వారలకు, ఉపాధ్యాయులకు, పోలీస్ శాఖలో పనిచేసేవారికి సదవకాశాలుంటాయి. వ్యాపారం యథాప్రకారం సాగిపోతుంది. స్త్రీలకు : ఉద్యోగ వృత్తులందు పెంపు, భూముల వలన ఆదాయం, గృహ కార్య నిర్మాణంలో అనుకూలతకు మేలయిన వారం.

మీనం : మీ పనులు వ్యాపార, వ్యవహార, రచనా రంగాలలో సుకరంగా సాగిపోతాయి. భూసంపద పెంచుకునే అవకాశాలు అనుకూలతకు ఆస్కారమున్నది. మీకు చేరవలసిన సొమ్ము కొంతయినా అందే మార్గమున్నది. వస్తుసేకరణకో వస్త్రసేకరణకో అవకాశం గల వారమే. స్త్రీలకు కుటుంబానందం, షైకిపోయే మార్గం, ముఖ్యముగా ఉద్యోగంలో అని గ్రహించాలి. వ్యాపారం చేసే వారయితే అనుకూలమే. రాజకీయ వాదులైతే మేలు చేకూరనున్నదని భావించి మెలగండి.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా!

## తాగండిక బోర్న్‌విటా.

మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహా యిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి. దీన్ని తయారుచేసింది, 100 సంవత్సరాలకు పైగా ఆరోగ్య పానీయాలు తయారు చేయడంలో ప్రత్యేకత గణించిన క్యాడ్‌బరీవారు.




**క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా**

దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక.



(గత సంచిక తరువాయి)

ప్రకాశరావు తల్లికి ఆరోగ్యం చక్కబడి వాళ్ళ ఇంటికి వెళ్ళిపోయింది. అయినా ప్రకాశరావు మాత్రం ఇక్కడే ఉంటున్నాడు. ఒకనాడు రాఘవయ్యగారు, బయట వరండాలో ఉన్న ప్రకాశరావుకి వినపడేట్టు బిగ్గరగా అన్నారు – "ఏమేవ్! నిన్నేనే! ఇలారా! చూడూ – రేపట్నించీ అల్లుణ్ణి ఇక్కడకు రావద్దని చెప్పు. మంచిరోజు చూసి అమ్మాయిని కాపురానికి పంపిస్తామని కూడా చెప్పు. అర్థమయిందా?" అని వీధిలోకి వెళ్ళిపోయారు.

ప్రకాశరావు మొహం రంగులు వెలిసిపోయిన పాతబట్టలాగా అయిపోయింది.

"ఇదెక్కడి విడ్డూరం!" అంటూ బుడి బుడి దీర్ఘాలు తీసింది నాగరత్నం.

ఇది జరిగాక నాలుగురోజులపాటు ప్రకాశరావు రాలేదు. 'కాస్త ప్రాణం తెరిపిన పడింది' అనుకున్నది తార. కాని, అయిదోరోజున రాఘవయ్యగారు పొలానికి వెళ్ళిపోయాక ప్రకాశరావు వచ్చాడు. ఆ సమయానికి తార బయట ఏదో పని చేస్తున్నాది. తర్వాత లోపలకు వచ్చి, గదిలోకి వెళ్ళబోయింది. నాగరత్నమ్మ ఆదరాబాదరా అడ్డం వచ్చింది. "ఆగాగు! ఆగు! ఎందుకే ఇపుడా గదిలోకి? ఎందుకు?" కోపంగా అడిగింది.

అర్థంకాక తెల్లబోయింది.

ఆ గది తలుపులు మూసి ఉండటానికీ, తల్లి కోపానికీ లంకె ఏమిటో తెలీక ఆలోచిస్తూ, సమాధానం చెప్పకుండా వెనక్కు తిరిగి పెరటిలోకి వెళ్ళిపోయింది.

అలా మరో నాలుగైదుసార్లు జరిగాక గానీ తారకు అసలు సంగతి అర్థంకాలేదు. అర్థమయ్యాక 'ఈ విషయం తండ్రికి తెలిస్తే ఇంకేమైనా ఉందా' ఊహించుకుంటూ భయపడింది. రాఘవయ్యగారు ఎంత మంచిగా ఉంటారో అంత ఖచ్చితంగానూ ఉంటారు. తన కిష్టంకాని పనిని, వద్దని చెప్పినా కూడా చేస్తూంటే చూసి, సహించే శక్తి ఎవరికీ ఉండదు. అందునా రాఘవయ్యగారి కోపం ఎవ్వరూ ఊహించలేనట్టిది. ఆయన రౌద్రాకారం ఎవ్వరూ చూడలేరు. తల్లి దగ్గర నెమ్మదిగా అన్నది కూడా! కాని, ఆవిడ తేలిగ్గా కొట్టిపారేసింది. పైగా 'నువ్వు చెబితే తప్ప ఆయనకెలా తెలుస్తుంది!' అనేసింది. అంతేకాకుండా పెద్దమ్మాయికి 'ఎలాగూ తెలిసింది కదా' అనే ఉద్దేశంతో ఇంక ఆనాటినుంచీ అల్లుడు ఎపుడు ఇంటికి వచ్చినా గుమ్మంలో తారనే కాపలా ఉంచేది.

లోపల ఉన్నది భార్యాభర్తలే అయినా కూడా అలా తండ్రికి తెలియకుండా అతను రావటమూ, పైపెచ్చు తానిలా వాకిట్లో కాపలా కాయటమూ చాలా అసహ్యంగా, హీనాతిహీనంగా అనిపిస్తున్నాది తారకు. కాని, తల్లికి భయపడి ఎదురుచెప్పేదికాదు.

*    *    *

"అక్కా, నీకు ఉత్తరం వచ్చింది" వీధిలోంచి అరుస్తూ, పరుగెత్తుతూ వచ్చాడు చంద్రం. పెరట్లో రోటి దగ్గర కూర్చుని మినప పప్పు కడుగుతూన్న తార చటుక్కున లేచింది. చేతులు కొంగుకు తుడుచుకుంటూ ఇంట్లోకి వచ్చింది.

ఆయన వ్రాసిన ఉత్తరం అందుకుంటూంటే ఏదో తెలియని తొట్రుపాటూ, అర్థంకాని ఉద్విగ్నతా!

హాల్లో ఉన్న వాసిడి గుంజకు ఆనుకుని ఉత్తరం చింపింది తార.

కుదురుగా, అందంగా, పొందిగ్గా ఉండే అతడి అక్షరాలు – ఎంతో హడావుడిగా వ్రాసినట్టుగా గీకేసి ఉన్నాయి! అయినా స్పష్టంగా అర్థమవుతూనే ఉన్నది.

"తారా! ఈ ఉత్తరం నీకు శుక్రవారంనాటికి అందుతుంది. ఆదివారం నుండి బెజవాడలో మీటింగులు జరుగుతున్నాయి. వాటికి నువ్వు కూడా రావాలి. శనివారం మధ్యాహ్నం రెండు గంటలకు గుడివాడ స్టేషనుకు రా. అక్కడ నీ కోసం నేను ఎదురుచూస్తూ ఉంటాను."

ఉత్తరంలాటి ఆ కాగితం ముక్కని నాలుగైదు సార్లు చదివితేగానీ అందులోని సారాంశం అర్థం కాలేదు తారకు. ఏవో మీటింగులంటూ జరుగుతాయని ఆనాడు వెంకటరత్నం చెబితే విన్నదేగానీ, తార ఎపుడూ చూడలేదు. తారకాదు; అసలు ఆ ఇళ్ళల్లో ఎవరూ ఇలాటి మీటింగులకంటూ ఎపుడూ వెళ్ళలేదు. అదేదో 'మిలిటరీ ఆర్డర్'లాగా వచ్చిన ఆ ఉత్తరం ముక్క తారను భయంతో ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాది. ఈ విషయం తండ్రితో చెబితే ఏమంటారో అనే ఆలోచన ఆమెని ఊపిరి సలపనంతగా ఇరకాటంలో పెట్టేస్తున్నాది.

ఆమెకు చీకటి ముసురుకుంటూన్న విషయం కూడా తెలియలేదు. గది తలుపులు తెరచుకుని ప్రకాశరావు బయటకు వచ్చాడు.

హాల్లో నిలబడివున్న తార వైపు ఉపోద్ఘాతదిరిగా చూసి వెళ్ళిపోయాడు.

నాగరత్నమ్మ పాలబిందె పుచ్చుకుని ఇంట్లోకి వచ్చింది. చిరుచీకటిగా ఉన్న ఇంట్లో కళ్ళు మసకగా అన్పించేసరికి ఎదురుగా ఉన్న తారపై విరుచుకు పడింది.

"నట్టింట గెడకర్రలాగా బిగదీసుకు నించోకపోతే కాస్త దీపాలు వెలిగించకూడదూ! అదికూడా నేనే చెప్పాలా! దరిద్రపు మొహందానా! గుడ్లేళ్ళబెట్టటం ఒకటి చేతనవును! పోవే – పోయి దీపాలు వెలిగించు."

దీపాలు వెలిగించి, దాలి వేసిన కుంపట్లో పాలకుండ పెట్టి ఇవతలకు వచ్చేసింది తార.

చిన్న అల్లుడు వచ్చిపోతుంటే చిన్నకూతురు



**జరిగిన కథ – 5** రాఘవయ్య, నాగరత్నం దంపతులకు తార, సరళ–రామారావ్, రామ్మోహన్, చంద్రం సంతానం. అందరిలోకీ పెద్దది, అందం, వినయవిధేయతలు కల 'తార' అంటే రాఘవయ్యగారికి ప్రాణం. సరళ బదకమ్మత్తరాలు, పైగా గడుసు స్వభావం కలది. రామారావ్ అదో తరహా మనిషి! మోహన్, చంద్రాలకు ఇంకా బాల్యావస్థ వీడలేదు. చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేసి, చదువు చెప్పిస్తున్న తమ్ముడు ప్రసాద్‌కు తార నిచ్చి పెళ్ళి చేయాలని నిశ్చయించుకొంటుంది నాగరత్నం. రాఘవయ్య కూడా కాదనలేదు. కానీ ప్రసాద్ పరశురామయ్య పెద్దకూతురును చేసుకొంటానని చెప్పగా ఏడ్చి అతన్ని బయటకు గెంటేస్తుంది. ఆ ఇంటి అప్పుడు మునసబు మామయ్య తారకు ఓ సంబంధం చూస్తాడు. ఆ సంబంధం తాలూకూ కుర్రాడు వెంకట్రావ్ తార వనసుసు ఆకర్షించలేకపోతాడు. తండ్రి అనుమతితో తార ప్రసాద్ పెళ్ళికి వెళ్తుంది. పరశురామయ్య తమ్ముడు శ్రీనివాసరావ్ అప్పటికే బాగ ప్రచారంలో వున్న కమ్యూనిస్టు పార్టీలో తిరుగుతుంటాడు. అతనికి గురువులాంటివాడు వెంకటరత్నం. యువకుడైనా ఆ పార్టీ ప్రముఖులలో ఒకడుగా పేరు తెచ్చుకుంటాడు. శ్రీనివాసరావ్‌తో కలసి ప్రసాద్ పెళ్ళికి వెళ్ళిన వెంకటరత్నం మదిలో 'అనుకోని సంఘటన' ద్వారా ముద్రవేసుకొంటుంది తార. బాబాయి బలరామయ్య తీసుకొచ్చిన సంబంధం, పెళ్ళిలో చూసిన 'అతనే'నని తెలుసుకొన్న తార ఎలాగయినా నాన్నతో చెప్పి ఒప్పించాలని నిర్ణయించుకొంటుంది. ఎవరెన్ని విధాల నచ్చజెప్పినా వినక వెంకటరత్నాన్నే పెళ్ళి చేసుకొంటుంది తార. భర్తపైన ఉండే గౌరవంకొద్దీ అతను పంపే ఉత్తరాలతో పాటు పార్టీ పుస్తకాలు కూడా చదువుతూ ఆనాటి రాజకీయాలను అవగతం చేసుకొంటుంది తార.

కాపురం చేసుకుంటున్నట్లూ, పెద్దకూతురు జేష్ఠలాగా ఇంట్లోనే ఉండిపోయినట్లూ ఆమెకు అనిపిస్తుందో, ఏమో - ప్రతి విషయంలోనూ ఆ భావం బయటపడేలా తిడుతూనే ఉంటుంది నాగరత్నమ్మ.

ఆ రాత్రి రాఘవయ్యగారు ఇంటికి వచ్చేసరికే ఎనిమిది అయిపోయింది. తార మనసంతా పొగతో నిండిన గదిలాగా ఉంది! తల్లిని అడిగినా ఫలిత ముండదని తెలుసు! అందుకే అసలామెను అడగనే లేదు. తండ్రి వచ్చాకే అడుగుదామని ఆయన రాకకోసం ఎదురు చూస్తున్నాది. ఆ ఎదురు చూడటంలో కాలం ఎంత మెల్లిగా, నిర్దాక్షిణ్యంగా కదులుతుందో చెప్పతరంకాదు!

రాఘవయ్యగారు భోజనం చేసి వరండాలో వాలుకుర్చీలో కూర్చున్నారు. చంద్రం ఛత్రపతి శివాజీని, రామ్మోహన్ చంద్రగుప్తమౌర్యుడినీ కంఠస్థం చేస్తున్నారు.

నాగరత్నమ్మ, సరళ, తార అన్నం దగ్గర కూర్చున్నారు. అటూ ఇటూ కెలుకుతోంది తార. ముద్ద లోనికి దిగటంలేదు. ఏనాడూ లేనంత

''ఎవరికి ?'' ఇంకాస్త ఆశ్చర్యంగా అడిగారు.

''నాకే వ్రాసారు. కాని, మీరుకూడా చదవండి నాన్నా,'' కూతురి ముఖంలోకి అర్థం కానట్లుగా చూసారు. క్రీనీడలో నిండున్న తార ముఖంలో ఏ భావమూ ఆయనకు కన్పించలేదు. ఎత్తుపీటమీద ఉన్న లాంతరు తెచ్చి తండ్రికి దగ్గరగా ఉంచింది.

''ఏదీ, నా కళ్ళజోడు కూడా ఇలా పట్రా.'' అన్నారు.

వంకెకు తగిలించి ఉన్న చొక్కా జేబులోంచి కళ్ళజోడు తెచ్చి అందించింది.

సరళ వచ్చి వరండాలోని అరుగుమీద కూర్చుంది. నాగరత్నమ్మ ''ఏమిటి అది ?'' అంటూ వచ్చి దిగువనున్న మెట్లమీద కూర్చుంది.

కాగితం విప్పి చదువుతున్నారు రాఘవయ్యగారు. హత్యకేసులో ఇరుక్కున్న ముద్దాయి పరిస్థితి ఆఖరి తీర్పు వినేముందు ఎలా ఉంటుందో ఆలాగే ఉంది తార మనస్సు!

అంత రాత్రి సమయంలోనూ తారకు నుదుటి మైనా, అరచేతుల్లోనూ చెమటలు పట్టేస్తున్నాయి!

చదివిన కాగితాన్ని తిరిగ్గా మడతలు పెడుతూ, తాపీగా నొక్కి అన్నారు రాఘవయ్యగారు ''ఎక్కడకూ వెళ్ళనవసరంలేదు.''

''ఎక్కడికి ? ఎవరు ?'' కాస్త విసుగ్గా అడిగింది నాగరత్నమ్మ.

మాట్లాడలేదు రాఘవయ్యగారు.

అప్పటివరకూ తండ్రి ఏమంటారో అనే ఆలోచించిందిగానీ, అసలు తనకేమనిపిస్తున్నదో తను ఆలోచించుకోలేదు! తండ్రిని అడగక పూర్వం 'వెళ్ళాలి' అని గట్టిగా అనుకోకపోయినా, ఆయన 'వద్దు' అన్నాక మాత్రం 'అయ్యో! వెళ్తే బాగుండునే!' అని సణుగుతున్నాది మనస్సు.

కాని, నోరు తెరచి ఏమీ చెప్పలేకపోయింది తార. ఎవరి పక్కలమీదికి వాళ్ళుపోయి పడుకున్నారు. తారకు నిద్ర రావటంలేదు. ఒళ్ళంతా అనురాగంతో తడిమినట్లుండే అతని చూపులు ఆమెని కుదురుగా పడుకోనివ్వటంలేదు. ఆయన్ని చూసి ఎన్ని రోజు



లయింది! ఆ రోజు... ఆ రోజున తనతో ఎంత ప్రేమగా మాట్లాడారు! ఎంత చిలిపిదనం ప్రదర్శించారు! ఇన్నాళ్ళకు తన నిరీక్షణ ఫలించి, ఆయన తనను రమ్మని పిలుస్తూంటే —

కాలం గడుస్తున్నకొద్దీ, రాత్రి అంతరించు తూన్నకొలదీ పూవులు క్రమంగా విచ్చుకున్నట్లుగా తార మనసు కూడా ఒక నిర్ణయంవైపు నిశ్చల మవుతున్నాది.

''ఏమయినాసరే వెళ్ళాలి! తెల్లవారాక తండ్రితో

ఆందోళనతో మనసు కలవరంగా ఉన్నాది. కంచం ఎత్తేసి చేతులు కడుక్కుంది. వరండాలోకి వచ్చి ఒకసారి తండ్రివంక చూసింది. మరలా లోనికి వెళ్ళింది. ఏనాడూ లేనిది మనసులోనే దేవుణ్ణి తలచుకున్నది. ఆ ఉత్తరం తీసుకెళ్ళి తండ్రి కిచ్చింది.

''ఏమిటమ్మా, ఇది ?'' ఆ కాగితంముక్కని అటూ ఇటూ తిప్పిచూస్తూ ఆశ్చర్యంగా అడిగారు.

''ఆయన వ్రాశారు నాన్నా,''

చెప్పి వెళ్ళాలి!" తార ఈ నిర్ణయానికి వచ్చేసరికి కోడి కూత విన్పిస్తున్నది.

* * *

తొలిప్రొద్దు ఘడియలలో మగతగా నిద్రపట్టిన తారకు మెలకువ వచ్చేసరికి బాగా తెల్లవారిపోయింది. వొడ్లో ఎవరిమీదనో గట్టిగ అరుస్తున్నాది నాగరత్నమ్మ. చటుక్కున లేచింది తార. గబగబా వీధి వాకిలి ఊడ్చి, నీళ్ళు జల్లి, ముగ్గు పెట్టింది.

వీధి అరుగుమీద కూర్చుని ముఖం కడుక్కుంటూన్న చంద్రం అక్కవైపు చూస్తూ ప్రేమగా అడిగాడు — "జ్వరం వచ్చిందా అక్కా?"

"ఉబ్బే! లేదురా, ఏం?" తలెత్తి ఆశ్చర్యంగా అడిగింది.

"ఏమీలేదు. ఆలస్యంగా లేచావు. పైగా నీ ముఖం కూడా అదోలా ఉంది."

మాట్లాడకుండా లోపలకు వచ్చేసింది. పాలేరు అంట్లు తోముతూంటే దగ్గర ఉండి అన్నీ శుభ్రంగా కడిగింది.

ముఖం కడుక్కుని లోపలకు వచ్చేసరికి రాఘవయ్యగారు చెప్పు లేసుకుని వీధిలోకి వెళ్ళిపోతున్నారు

హతాశురాలైంది తార.

పది అయింది, పదిన్నర అయింది! ఇంకా రాఘవయ్యగారు రాలేదు.

స్నానం చేసాక ఉతికిన చీర కట్టుకోబోయి, మళ్ళీ మానేసి, పెట్టెలోది తీసి కట్టుకుంది. తండ్రి కోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాది.

మనసంతా ఆందోళనా, భయం, మరెన్నో భావాలతో ఎలాగో ఉంది.

పదకొండుంబావు అవుతోంది! చెమట తుడుచుకుంటూ వచ్చారు రాఘవయ్యగారు. గబగబా కుండలోంచి చల్లటి నీళ్ళు ముంచి తెచ్చిచ్చింది. ఖాళీగ్లాసు అందుకుంటూ మెల్లిగా, సంకోచంగా

## తార

అడిగింది— "వెళ్ళకపోతే ఆయనేమయినా అనుకుంటారేమో నాన్నా!"

"ఎక్కడికి?" ఆశ్చర్యంగ అడిగారు రాఘవయ్యగారు. ఆయన తాత్కాలికంగా ఆ ప్రస్తావనే మర్చిపోయారు.

అంతకంటే ఆశ్చర్యంగా చూసింది తార. కూతురి ముఖ భావాలు చూచేసరికి ఆయనకు రాత్రి విషయం చటుక్కున జ్ఞాపకం వచ్చింది. "ఓహో! అదా!" అన్నారు. అంతలోనే గంభీరంగా అయిపోయారు. "ఏముంది అనుకోవడానికి! ఏమీ అనుకోడు!" స్థిరంగా అన్నారు.

"కాదు నాన్నా, ఆయనకు చాలా కోపమట! వెళ్ళకపోతే కోపం తెచ్చుకుంటారేమో!"

"ఇదిగో చూడూ! ఇలాటి మీటింగులూ, ఇలాటి తిరుగుళ్ళూ మన ఇంటా ఒంటా లేవు! అందునా ఆడపిల్లవు! ఒంటరిగా ఎలా వస్తావనుకుంటాడు? బుద్ధి లేకపోతేసరి! అతగాడు రాయటానికి, నువ్వు బయలుదేరటానికీనూ! అసలు అతడు వెళ్ళటమే నా కిష్టంలేదు."

అవతలకు వెళ్ళిపోయారు. రాఘవయ్యగారు అలా అంటూన్నకొద్దీ తారలోని పంతం కూడా పెరుగుతున్నాది. అది గమనించే రాఘవయ్యగారు అలా వెళ్ళిపోయారు. రాఘవయ్యగారికి అసలు వాదనలంటే ఇష్టం ఉండదు! అందునా తారతో వాదించటం ఆయనకసలు ఇష్టంలేని పని! అందుకే 'ఇంక మాట్లాడేది ఏంలేదు' అనే ఉద్దేశ్యాన్ని తెలియజేస్తున్నట్లుగా "అన్నం పెట్టు" అని లోపలకు వెళ్ళిపోయారు.

ఆయన అలా వెళ్ళిపోవటం తారకు చాలా చిన్నతనమనిపించింది. 'తన భర్త తనను రమ్మని వ్రాస్తే తనను వీళ్ళు పోనీయటంలేదు! అంటే తన భర్త మాట వీళ్ళకేమీ లెక్కలేదన్నమాట! అంటే తన భర్తపైన వీళ్ళకేమాత్రం గౌరవం లేదన్నమాట!......' అలా అలా చాలా దూరం ఆలోచించేస్తున్నాది తార మనస్సు.

ఆలోచించినకొద్దీ ఉక్రోషం, పంతం పెరుగుతున్నాయి.

గబుక్కున ఒక నిర్ణయాని కొచ్చేసింది. 'నానేమీ చిన్నపిల్ల కాదు. మంచీ, చెడూ తనకూ తెలుసు! పెళ్ళి అయిన ఆడపిల్ల భర్త మాటనే వినాలి! తన భర్త అంటే అమ్మకే కాదు, నాన్నగారికి కూడా లెక్కలేదు. అందుకే ఆయన మాటకు చిల్లిగవ్వంత విలువ కూడా ఇవ్వకుండా తీసిపారేసారు. వీళ్ళు అర్థం చేసుకోలేనంత మాత్రాన ఆయన గొప్పతనమేమీ తగ్గిపోదు. తనకు తెలుసు! వీళ్ళంటే నాకు భయమేమిటి? అసలు నేనెందుకు భయపడాలి? నే వెళ్ళేది నా భర్త దగ్గరకేగానీ వేరే చోటుకేం కాదు! ఆయన ఎక్కడకు రమ్మంటే అక్కడకు వెళ్ళాల్సిన బాధ్యత తనకున్నది! అది తన కర్తవ్యం!' ఆలోచిస్తూనే గబగబా ఒక సంచీలో నాలుగు చీరెలూ, నాలుగు జాకెట్లూ, లంగాలూ, బాడీలూ, సోపూ, టవలూ, దువ్వెనా, కుంకుమభరిణా సర్దుకుంది. అదే వేగంతో లోపలి గది దగ్గరకు వెళ్ళింది.

రాఘవయ్యగారు భోజనం చేస్తున్నారు. అన్నం తినేటపుడు చెప్పి ఆయన మనసు నొప్పించటం మంచిది కాదు అనుకుంది. 'నేనిలా వెళ్ళిపోవటం ఆయన పెద్దరికానికో దెబ్బ! అది ఆయన ఊహించనిది! అయినా తప్పదు. కానీ, దానిని ఎదుర్కోనేందుకు ఆయన సిద్ధంగాలేరు. అందువల్ల భోజనం పూర్తి అయ్యాక చెప్పి వెళ్ళొచ్చు!' అనుకుని ఓపిగ్గా నించుంది.

గూటిలో గడియారంకేసి చూసింది. పావు తక్కువ పన్నెండు అయింది. అదిరిపడింది తార. తలతిప్పి చూచేసరికి మజ్జిగన్నం ఆఖరులో ఉన్నారు రాఘవయ్యగారు. ఇంక ఏ మాత్రం ఆలస్యం చేయకుండా అన్నది తార — "నన్ను క్షమించండి నాన్నా! నేను వెళ్తున్నాను" సంచీ పట్టుకుని బయటకు వచ్చేసింది.

మొదట రాఘవయ్యగారు తెల్లబోయారు. తర్వాత 'ఆగు!' అని అరిచారు. కాని అప్పటికే గేటుదాటి వీధిలోకి వచ్చేసింది. రాఘవయ్యగారు అప్రయత్నంగానే వరండాలోకి వచ్చారు. చెరువు ప్రక్కనుంచీ గబగబా పరుగెత్తుతూన్న తారను చూసి కోపోద్రిక్తులైనారు.

వెనకాలే వచ్చిన నాగరత్నమ్మ ఏదో అంటుంటే ఆ కోపమంతా ఆమెపైన చూపిస్తూ "నువ్వు నోరుముయ్యి" అని గట్టిగా అరిచారు

* * *

మంచి ఎండ! పైగా మధ్యాహ్నం! అన్నం తినలేదు. రాత్రికూడా సరిగ్గా తినలేదు. పైగా రాత్రి నిద్రకూడా పోలేదు సమయానికి అందుకుంటానో, అందుకోలేనో అనే ఆందోళన! వీటికి తోడు నాన్నను ఎదిరించి వచ్చేసానే అనే ఆవేదన.

వేగంగా పరుగెత్తుతున్నాది. అసలా పరుగు తారకు అలవాటులేనిది. పరుగేకాదు, అసలు అంత

## భయం అంటే!?

భయం అంటే ఏమిటో యింతవరకు ఏ సైన్సు కూడా సరైన నిర్వచనం చెప్పలేకపోయింది. భయం ఒక చేదు అనుభవం. దీనికి కారణం వుండనివ్వండి, లేకపోనీండి, యీ మాట మాత్రం నిజం! నిర్వచనమే లేనిదానిని యిక కొలిచే అవకాశమే లేదు. పశ్చిమ జర్మనీలోని ఉల్మ్ విశ్వ విద్యాలయానికి చెందిన శాస్త్రజ్ఞులు డా. వోకల్‌ఫాస్ట్, ప్రొ. గూంటర్ హోల్ భయాన్ని యీ క్రింది విధంగా వర్ణిస్తున్నారు. భయమనేది అంతరంగిక అవిశ్రాంతి, ఆందోళన, వేదన, నరాల విస్ఫుత్తువ, ఏదో తెలియని దాని దయా దాక్షిణ్యాలపై ఆధారపడి బ్రతుకుతున్నామనే భావన, విసుగు, ఎక్కడకో పారిపోవాలనే కోరికల సమ్మేళనం. భయం వలన విపరీతమైన లక్షణాలు ఏర్పడవచ్చు. గుండెజబ్బులు, గొంతులో ఏదో అడ్డం పడినట్లుండటం, ఆకలి లేకపోవడం, కొన్ని సందార్భాలలో విపరీతమైన ఆకలి, జీర్ణాశయ వ్యాధులు, లైంగిక కోరిక తగ్గడం, స్త్రీలలో ఋతుస్రావం సక్రమంగా లేకపోవడం, వణుకు, నరాల ఒత్తిడి, ఏర్పడవచ్చు. భయాలలో చాలా వాటిని అర్థం చేసుకొనవచ్చు. అవి పూర్తిగా అర్థరహితంకావు. మరో ముఖ్యమైన సంగతి భయపడటం నేర్చుకోని వ్యక్తి దానికి మూల్యాన్ని చెల్లింపవలసి వుంటుంది. చాలా భయాలకు శారీరక కారణాలు కూడా వుంటాయి. ఉదాహరణకు: తాగిన మైకంలో ఏర్పడిన భయం, గుండె జబ్బుల వలన ఏర్పడే భయాలు కేవలం నాటకం వంటివికావు. ప్రమాదాల వలన కూడా భయం ఏర్పడవచ్చు. కానీ, యిది తాత్కాలికమే. చరిత్ర తెలిసిన ప్రతి వ్యక్తి పూర్వకాలం కంటే ప్రస్తుతం "చెడు" ఎక్కువగా వున్నదంటే నమ్మడు. కానీ వివిధ రకాలైన ప్రచార సాధనాలు దుర్వార్తలను ప్రతి యింటికి మోస్తున్నాయి.

దూరం ఎపుడూ నడవలేదు కూడాను. సామాన్యంగా ఆమె ఎపుడూ ఎక్కడకూ వెళ్ళేదికాదు! ఎపుడయినా వెళ్ళినా, బండిలోనే వెళ్ళేది. బండిలోనే వచ్చేది. అలాంటి తార ఆ ఎర్రని ఎండలో డొంకదారి వెంబడి చేతి సంచీతో పిచ్చిదానిలా పరుగెడుతున్నాది.

చెమటలు కారుతున్నాయి. దడ వస్తున్నాది.

అయిన పరుగెడుతూనే ఉన్నది.

అవిగో —

రైలు పట్టాలు!

తారకసలు దారికూడా తెలియదు. అందుకే దగ్గరవారి వదిలి రైలు పట్టాల వెంబడి పరుగెత్తుతున్నాది. ఆ రాళ్ళల్లో పరుగుతీయటం బహు కష్టంగా ఉన్నది. అయినాసరే — అలా — పరుగెత్తుతూనే ఉన్నది.

ముందూ, వెనుకా జన సంచారమే లేదు. దూరంగా పొలాలలో అక్కడో మనిషి, ఇక్కడో మనిషి అన్నట్లుగా చెదురు మదురుగా తిరుగాడుతున్నారు. అయినా కూడా తారకు ఏమీ భయమనిపించటంలేదు. అసలామె మనసులో — తానిలా ఒంటరిగా, బాటగాని బాటలో పోతున్నాను అనే భావమేలేదు. ఆమెకున్న ఆలోచనంతా ఒక్కటే! ఆయన చెప్పిన సమయానికి చేరుకోగలనా, లేదా!

ఆ గాభరాతోనే పరుగెత్తుతూన్న తార రాళ్ళు తగిలి గబుక్కున బోల్తాపడబోయింది. ఎలాగో తమాయించుకని నిలబడటంలో కుడికాలి చెప్పు తెగిపోయింది. ఆ తెగిపోయిన చెప్పుతో పరుగెత్తటం అసాధ్యమనిపించింది. ఆ చెప్పులు తీసి చేత్తో పట్టుకుంది.

ఎడంచేత్తో చెప్పులు, కుడిచేత్తో సంచీ పట్టుమని పరుగెత్తున్నాది.

ఎవరో తరుముతున్నట్లూ, ఏదో పులి పంజా నుండి తప్పించుకోవటాని కన్నట్లూ వేగంగా పరుగిడుతూనే ఉన్నది.

జారిపోయే పయటను సర్దుకోవటానికీ, కాళ్ళకు అడ్డం పడుతూన్న చీరెకుచ్చెళ్ళను ఎత్తిపట్టుకోవటానికీ చేతిలో చెప్పులుండటం వల్ల వీలుకావటం లేదు. అందువల్ల 'పోతే పోనీయ్' అన్నట్లు ఆ చెప్పుల్ని దూరంగా విసిరేసింది.

మళ్ళీ పరుగెత్తుతున్నాది.

తల ఎండుతున్నాది. కాళ్ళు మండుతున్నాయి. ఒళ్ళంతా వేడెక్కిపోయింది. దాహమవుతున్నాది. కళ్ళు తిరుగుతున్నట్లుగా ఉంది. పడిపోతానేమో అని భయమేసింది.

ఎడమకాలి చిటికెన వేలికి రైలుపట్టా తగిలి రక్తం కారుతున్నాది. అయినాసరే ఆమె లెక్క చేయకుండా పరుగెత్తుతూనే ఉంది.

ఒకటి, రెండుసార్లు తూలి పడబోయి నిలదొక్కుకుంది. ఆమెకు తెలియకుండానే నోరు తెరచి "భగవంతుడా!" అని బిగ్గరగా అనేసింది.

అలా ఆపకుండా పరుగెత్తుతూనే ఉంది.

దూరంగా రైలు స్టేషను.

దానిని చూచేసరికి తారలోకి క్రొత్త జీవం బుస్సున ఎక్కివచ్చింది. రెట్టించిన ఉత్సాహంతో ఇంకా వేగంగా పరుగెత్తుతున్నాది.

* * *

'వస్తుంది!' అనే నిండు నమ్మకంతో ఉన్నాడు వెంకటరత్నం. కానీ, సమయం గడుస్తూన్న కొలదీ 'ఇంకా రాదేమిటి?' అనే సందేహం వచ్చింది. మరి కాసేపటికి విసుగ్గా ఎదురుచూడటం అవుతోంది.

ట్రెయిను కదలటానికి ఇంకా పదిహేను నిమిషాలే ఉన్నది.

'ఎందుకు రాలేదు!' విసుగ్గా ప్లాట్‌ఫారమ్ మీద పచార్లుచేస్తూ నిమిషానికో మారు గేటు వంక చూస్తూనే ఉన్నాడు. 'ఉహూం — ఇంకా రాలేదు!' అనుకుంటూన్న వెంకటరత్నం దూరంగా రైలు పట్టాల వెంబడి పరుగెత్తుకొస్తూన్న ఆడమనిషిని చూసి ఇంకాస్త విసుక్కున్నాడు.

'ఈ జనానికి ఎప్పటికి బుద్ధి వస్తుందో, ఏమో! ఆఖరి సమయంలో ఇలా లఘు మేఘాలమీద అవసరపడి ప్రాణాలు పోతూన్నట్లు పరుగెత్తకపోతే కాస్త ముందుగా బయలుదేరకూడదూ!'

వెంకటరత్నం మళ్ళీ తలతిప్పి చూచేసరికి ఆ మనిషి ఇంకాస్త దగ్గరకు వచ్చింది.

సన్నగా, పొడవుగా — 'తార కాదుకదా!' సందేహంగా చూస్తూన్న వెంకటరత్నంలో కొండంత కుతూహలం చోటు చేసుకుంది.

ఇంకాస్త దగ్గరకు వచ్చేసింది.

గుర్తుపట్టాడు వెంకటరత్నం.

తారే!

సందేహం లేదు! తన భార్య — తార!

'ఇదేమిటి! ఇలా ... ఈ పట్టాల వెంబడి ... ఒంటరిగా ...'

దగ్గరకు వచ్చేసింది.

అపుడు తలెత్తింది తార!

ఎదురుగా — వెంకటరత్నం!

అతని కళ్ళనిండుగా ఆశ్చర్యం, ఆనందం

'హమ్మయ్య!' తారలోని ప్రాణమంతా కళ్ళల్లోనే గూడుకట్టి ఉన్నాది. అంత దూరం పరుగెత్తి రావటం వలన ఆ ఎండలో మనిషి కందిపోయి, చేయిపట్టి చిదిపితే రక్తం కారిపోతుందేమో అన్పించేలా ఉంది. ఆయాసంతో రొప్పుతూ, మనిషి నిలబడలేకుండా తూలిపడిపోయేలా ఉంది.

గబుక్కున చేతులు చాచి ఒకచేత్తో తారను దగ్గరగా పట్టుకుని, రెండో చేత్తో సంచీని తీసుకున్నాడు.

తన మోచేతి వంపులో గువ్వలాగా ఒదిగిపోయిన తార శరీరం వేడిగా ఉంది. అంతేకాదు — అది ఒణుకుతున్నాది కూడాను. ఆ ఒణుకు తాలూకూ స్పందనా, ఆమెలోని వడా, అతి వేగంగా కొట్టుకుంటూన్న ఆమె గుండె టక టకలూ — మూసుకుపోతూన్న ఆమె కళ్ళల్లో ఆమె పరిస్థితి స్పష్టంగా కన్పిస్తూనే ఉన్నది.

"తారా!"

అబ్బ! ఆ పిలుపుకోసం ఎంత కష్టపడి వచ్చింది.

నిజంగా ఇది ఒక పెద్ద ఎడ్వంచర్! కథల్లో లాగా ... ఎంత ధైర్యంగా ... ఎలా ... ఓహ్!

అంతా ఒక కలలాగ ఉంది. నిజంగా వెంకట్ దగ్గరకు వచ్చేసానా! లేక భ్రమేనా! కుడిచేతిని ఎత్తి అతని వ్రేళ్ళపై వేసి గట్టిగా పట్టుకుంది.

అలా అతని బలమైన చేతి కౌగిల్లో ప్రాణం పోతున్నాదేమో అనిపించింది. అంతకంటె మించిన అదృష్టంలేదు అన్పిస్తోంది

"తారా!"

"ఊఁ —" 'కాసేపు కళ్ళు మూసుకుని పడుకుంటే బాగుండును' అన్పిస్తోంది తారకు.

తారలోని భావ పరంపర వెంకటరత్నానికి అర్థమైనట్లు ఆమెని పొదివి పట్టుకుని "లోపలకు పద" అంటూ నడిపించుకొచ్చాడు. ఆ కంపార్టుమెంటులో మరెవరూ లేరు. కిటికీ ప్రక్కగా తారను




డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

### డి. ఎస్. ఆర్ — పార్వతీపురం

గ్యాస్ ట్రబుల్ ఎలా వస్తుంది? దీనికి తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి? గ్యాస్‌ట్రబుల్ రోగులు దాంపత్య జీవితానికి అర్హులా? దయచేసి దీని నివారణోపాయము చెబుతారా?

★ గ్యాస్ట్రిక్ ట్రబుల్ అనేదాన్ని చాలామంది "గాస్ ట్రబుల్" అని వాడటం జరుగుతున్నది.

'గ్యాస్ట్రిక్' అంటే కడుపు అని అర్థం. కడుపు వాయటాన్ని గ్యాస్ట్రైటిస్ అని అంటారు. కడుపులో పుండు ఉన్నప్పుడు దానిని గ్యాస్ట్రిక్ అల్సర్ అని అంటారు.

ఆహారాన్ని నియమబద్ధంగా తీసుకోకపోవటం, ఎక్కువగా కారం, పులుపు వాడటం, మధుపానం, సిగరెట్ మొదలయినవి కాల్చటం, మొదలయిన వాటి వల్ల గ్యాస్ట్రైటిస్ తర్వాత గ్యాస్ట్రిక్ అల్సరు రావటం జరుగుతుంది.

ఈ రోగానికీ, దాంపత్య జీవితానికీ ఏ సంబంధమూ లేదు. ఆహారం నిర్ణీత సమయంలో తీసుకోవటం, ఇంకా పైన ఉదహరించిన వాటి వాడకం మానటం, యాంటాసిడ్ మాత్రల వాడకం మొ॥ చర్యల వల్ల ఈ రోగాన్ని నివారించవచ్చును.

### వి. వి. ఎస్. — బిప్పలపాలెం

నాకు ఒక మానసిక వ్యాధి వున్నది. ఎప్పుడూ సిగ్గు, భయం, ఆందోళనగా వుంటుంది. నలుగురిలో కలిసి తిరుగలేను. అందరూ శత్రువుల్లాగా వున్నట్లు వుంటారు. అహంకారంగా వుంటుంది. ఈ మానసిక వ్యాధికి ఎక్కడ ట్రీట్‌మెంటు తీసుకోవాలో తెలుప ప్రార్థన.

★ ఇటువంటి మానసిక వ్యాధులకి సైకియాట్రిస్టులు చికిత్స చేస్తారు. వీరు హైదరాబాదు, విశాఖపట్నం, గుంటూరు, కర్నూలు మొదలయిన ప్రాంతాలలోను, మెడికల్ కాలేజీలు ఉన్న ఊళ్ళలోను ఉంటారు. ఇంకా కొన్ని జిల్లా కేంద్రాలలో కూడ వీరు ఉండవచ్చును.

### టి. వి. కె — మచిలీపట్నం

నాకు వివాహమై 6 నెలలు అయినది. రెండు సం॥ల వరకూ సంతానము కలుగకుండా కుటుంబ నియంత్రణ అనులు జరుపుటకు నిర్ణయించుకున్నాము. నేను సేఫ్ పిరియడ్ మాత్రలు వాడుతున్నాను. అవి వాడిన దగ్గరనుండి నాకు నీరసము, కాళ్ళు లాగటం జరుగుతోంది. వాళ్ళ నీటిని వాడటం ఎలానో తెలియలేదు. వాడకం మార్పువలననే ఇలా జరుగుతోందని నా ఉద్దేశం. ఎలా వుపయోగించాలో తెలుప ప్రార్థన. ఇవి గాక ఇంకా స్త్రీలు వాడే విధానాలు ఏమైనా వున్నాయా?

★ సేఫ్ పీరియడ్‌కి అంటూ మాత్రలు లేవు. మీరు వాడేది ఓరల్‌పిల్స్ అయి ఉంటాయి. ఈ మాత్రలు హార్మోనుల ప్రభావాన్ని కలిగి ఉండటం, ఖాళీగా ఉన్న కడుపులో ఈ మాత్రలు పడటంవల్ల కడుపు భాగం వాయటం మొదలయిన వాటివల్ల కొందరికి నీరసం, ఛాతీ నెప్పి, చేతులు, కాళ్ళు లాగటం జరుగవచ్చును.

ఈ మాత్రలు ఆహారం తీసుకొన్న తర్వాత నిదురపోయేముందు వేసుకొంటే మంచిది. కుటుంబ నియంత్రణకి ఇంకా ఎన్నో విధానాలు ఉన్నా మీరు వాడ తగిన వాటిలో ఈ పద్ధతి మెరుగయినది.

### కె. ఆర్. ఆర్. — గుంటూరు

పుట్టుకతో గుండెజబ్బు వచ్చే అవకాశ మున్నదా? ఈ జబ్బు వున్న చంటిపిల్లలకు తీసుకోవలసిన జాగ్రత్తలేమిటి? ఈ జబ్బు రావటానికి గల కారణాలేమిటి?

★ తప్పకుండా ఉన్నది. ఇలా పుట్టుకతో ఉండే హృద్రోగాలను కన్‌జెనిటల్ హార్ట్ డిసీజ్ అని అంటారు.

ఎక్కువ శ్రమ కలిగించకుండా చూసుకోవటం, దగ్గు జలుబు మొదలయినవి వచ్చినప్పుడూ వెంటనే చికిత్స చేయించటం, రెండు మూడు నెలల కొకసారి వైద్యుల చేత పరీక్షింపచేయటం తీసుకోతగిన జాగ్రత్తలు.

ఈ జబ్బు రావటానికి ఫలానా అంటూ కారణాలు చెప్పటం కష్టం. తల్లి గర్భంలో ఉండే టప్పుడు జరిగే కొన్ని మార్పులవల్ల ఈ రోగం రావచ్చును. కొందరికిమటుకు ఎందుకు రావాలనే దానికి ఖచ్చితంగా జవాబు చెప్పటం కష్టం. ●

---

కూర్చోబెట్టి, ప్రక్కగా సంచీపెట్టి "ఇపుడే వస్తాను" అని చెప్పి వేగంగా బండి దిగి వెళ్ళాడు. అయిదు నిమిషాల తర్వాత ఒక పిల్లవాడిచేత రెండు గ్లాసులు పట్టించుకొచ్చాడు.

"తారా! ఇదిగో, ఇది త్రాగు. ఆ దడ తగ్గిపోతుంది" అన్నాడు.

"ఏమిటిది?"

"బాదంఫీర్!. బాగుంటుంది. త్రాగు!" చిరునవ్వుతో గ్లాసు అందిస్తూ అన్నాడు.

ఆ పేరూ వినలేదు. దానిని ఎన్నడూ చూడ లేదు కూడాను!

పైన అయిసు ముక్కలు తేలుతూ అందంగా కన్పిస్తున్నాది.

గ్లాసు అందుకుంది తార.

'అది ఏదయినా — ముందర ఎండిపోతూన్న గొంతుకలోనికి ఏదో ఒక చల్లని ద్రవాన్ని పోయాలి. లేకపోతే దాహంతో ప్రాణమే పోయేలా ఉంది!' అనుకున్న తార గ్లాసు నోటి దగ్గర పెట్టుకుని గడగడా త్రాగేసింది.

## తార

'అబ్బ! కడుపులో ఎంత చల్లగా ఉన్నది. మెడ క్రిందా, చెవుల దగ్గరా, కళ్ళల్లోనూ, గొంతుక లోపలా — ఏదో చల్లని హాయి!'

ఈ అనుభవం తారకు క్రొత్త! కళ్ళు మూసుకుపోతున్నాయి. తార ఎంత బలవంతంగా తెరవాలని ప్రయత్నించినా అవి తెరుచుకోలే నంటున్నాయి.

అసలు ... అలా కూర్చోలేకపోతున్నాది. శరీర మంతా కలిసి ఎలాగో అయిపోయి, ఎక్కడికో తేలి పోతున్నాది.

తార స్థితి గమనించుతున్నాడు వెంకటరత్నం. ఆమెకు 'వడదెబ్బ' లాంటిది తగల్లేదు కదా అని క్షణంసేపు భయపడ్డాడు కూడాను.

"కొంచెంసేపు ఇలా పడుకో" తన తొడ చూపిస్తూ అన్నాడు.

ఆ పరిస్థితుల్లో కూడా సిగ్గులాంటి భావం ఆమెని త్వరగా పడుకోనివ్వలేదు. కాని, అంతలోనే ఏదో మత్తులాంటి పొర ఆమెని ఆవరించేసింది. దాదాపు అచేతనావస్థలో ఉన్న తారను వెంకటరత్నమే పడుకోపెట్టాడు.

తన తొడపై తలపెట్టి పడుకున్న తారపై — అనంత జలరాశితో నిండి ఉండే కడలి తరంగాల్లా — ఆ క్షణంలో అతడి మనసులో ప్రేమ తరంగాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి. చెమటకు తడిసి చెంపలకు అతుక్కుపోయిన ఆమె జుట్టును సవర దీసాడు. చెదరిన కుంకుమను సరిచేసాడు. బాగా చిక్కిపోయినట్లుగా ఉన్న తార చెంపలూ, చెవుల ప్రక్కన ఉన్న జుట్టూ నిమురుతూన్న వెంకటరత్నానికి ఆమెని ముద్దు పెట్టుకోవాలన్పించింది.

మూసిన కనులూ, పలుచని పెదవులూ — నిదురలో ఉన్నా కూడా ఏదో తెలియని సంతృప్తితో నిండి హాయిగా నవ్వుతున్నట్లున్నాయి.

ముద్దుగా ఉన్నది తార!

అంత రాజకీయ నాయకుడి బుర్రలో అంతగా నిండిపోయిన తార — నిజంగా ధన్యురాలు!

(ఇంకా వుంది)

# అసలు జుట్టు ఎలా పెరుగుతుంది?

ఏదైనా అంతే-మరి. అలాగే జుట్టుకూడా సరియైన పోషణ ఉన్నప్పుడే పెరుగుతుంది. దురదృష్టవశాత్తు ఏంజరుగుతోందంటే, యీ కాలంలో జుట్టుకు వాడే వాటన్నిట్లో కృత్రిమ పదార్థాల కలయిక ఉంటోంది కొద్దోగొప్పో. మరి ఆధునికమైన అలవాట్లలో జుట్టుకి అసలు నూనె రాయక పోవడంతో యీ సమస్య మరింత జటిలమైంది.

**పారాచూట్: మీ అమ్మగారు, వాళ్ళ అమ్మగారూ అందరి యొక్క విలువైన రహస్యం.**

తరతరాల నుంచి జుట్టు పొడుగ్గా, ఒత్తుగా పెరగడం కోసం స్త్రీలు శుద్ధమైన కొబ్బరి నూనె వాడుతూవచ్చారు. ప్రకృతి సిద్ధమైన పోషణ నిచ్చేదిది. చక్కని తలకట్టూ, అందమైన జుట్టును పెంచేదది.



పారాచూట్ మీ అమ్మగారి ఆ విలువైన తలకట్టులోని రహస్యం. కొబ్బరి చెట్లనుంచి కేరళలో ఎండకి ఎండబెట్టిన, చేతులతో దింపి కొబ్బరి బొండాల నుంచి తాజాగా తీసినదిది.

**మరింత శుద్ధమైన మరింత తాజా అయిన కొబ్బరి నూనెను గుర్తించడానికి 3 పద్ధతులు.**



ఇది నిజానికి అమ్మగారు అవలంబించిన తెలికైన పద్ధతి. మొదట మీరు చూడవలసింది అది పారదర్శకంగా ఉందా అని. రెండవది, అది పాతబడి మెతక వాసన వేస్తోందా తాజా వాసన వస్తోందా అని. మూడవది, ఆ నూనెను ఒక చెంచాడు పోసి అది మందంగా, మెతకగా ఉందా, లేక మృదువుగా పారుతుందా అని చూడటం.

**మీ జుట్టుకు కేవలం అత్యంత శుద్ధమైన కొబ్బరి నూనెనే వాడండి.**

మీరు వాడే నూనెకు యీ మూడు పరీక్షలూ చెయ్యండి. మీరు చూసేదేమిటంటే, పారాచూట్ కొబ్బరి నూనె మిగతా నూనెల కన్న మరింత తేట అయినదనీ, మరింతగా తాజా అయిన దనీను. దీన్ని క్రమంతప్పకుండా వాడండి. వారాని కొకసారి. దాంతో పికిక ఒత్తయిన, ఆరోగ్యకరమైన జుట్టు.




# పారచూట్

మరింత తాజాదనంగల కొబ్బరి నూనె-జుట్టుకు ప్రకృతిలోని మంచి లక్షణాల్ని యిస్తుంది.

# మళ్ళీ ఎప్పుడో.. ఎక్కడో..?



ఎస్. వి. రమాదేవి

"మా ఇందిర ఉత్తరం వ్రాసింది రమేష్! తన పరీక్షలై పోయాయిట..." చేతిలోని కవరుని పదోసారి చదువుకుంటూ ఉత్సాహంగా చెప్పాడు కిశోర్.

"ఊహూఁ... అలాగా!" అన్నాడు ఏదో అర్జెంటు ఫైలుని చూసుకుంటూ మధ్య మధ్య మరేదో వ్రాసుకుంటూ.

"ఈసారి సెలవులకు ఇక్కడికే వస్తుందిట వూరు చూట్టానికి" ముఖమంతా వెలిగిపోతుండగా చెప్పాడు మళ్లీ.

"మంచిదే" అన్నాడు ఫైలువంకే దీక్షగా చూస్తూ రమేష్.

"కాని... కాని..." అంతలోనే విచ్చిన ముఖం కాస్తా ఎడలిపోయింది. "కాని... ఇప్పుడెలా?" అన్నాడు నీరసంగా.

"ఏం?" తలెత్తకుండానే ప్రశ్నించాడు రమేష్.

"ఇందిర వచ్చేప్పటికి నేనుండనుగా? సరిగ్గా ఈ సమయానికే ఆ క్రికెట్‌మేచ్‌కి పిలుపు రావాలా? అటు వెళ్లకుంటే వీల్లేదు. వెళ్తే ఇందిర..." అక్కడితో ఆపి బిక్కముఖం పెట్టాడు కిశోర్.

"ఏమిటోయ్ నీ గోలా...?" అప్పటికి తన పని ముగించి ఫైలు మూసి, పెన్ కేప్ పెట్టేస్తూ తీరిగ్గా తలెత్తాడు రమేష్.

ఉరిమి చూశాడు కిశోర్. "నా బాధ నీకు గోలగా వుందన్నమాట?"

"సరేలే! కోప్పడకు. ఇంతకూ ఏమిటా బాధ? ఎవరో వస్తారన్నట్టున్నావు కదూ? ఎవరు? ఎందుకూ?"

"ఆరి... దుర్మార్గుడా" తన బాధ మరచిపోయి, ఆశ్చర్యంగా నోరు వెళ్లబెట్టాడు కిశోర్. కాసేపటికి తేరుకుని, "ఇంతసేపూ నే చెప్పేది వింటున్నావే అనుకున్నాను 'ఆహా'... 'అలాగా' అంటూంటేను! అసలేమీ తలకెక్కలేదూ?" అన్నాడు ఒళ్ళు మండిపోతుండగా.

"నా పనేదో చేసుకునేటప్పుడు చెప్తే ఎలా ఎక్కుతుంది? సరేలే! యిప్పుడు చెప్పు" నిమ్మకు నీరెత్తినట్టు తాపీగా ప్రశ్నించాడు రమేష్

కోపంతో వేడెక్కిన కిశోర్ జవాబు చెప్పక పోవటంతో, తనే అతడి చేతిలోని కవరు నందుకొని చూశాడు రమేష్. చదవటం ముగించి, "అదా సంగతి..." అన్నాడు ఓరగా మిత్రునివంక చూస్తూ. కిశోర్ ముఖంలో కోపచిహ్నాలు కొద్దిగా సడలటం గమనించి, "ఇంతకూ మీ మరదలు త్వరలో వస్తోందన్నమాట?" అన్నాడు హుషారుగా, అతడి మరదలొస్తే, తనకేదో ఒరిగిపోతుందన్నంత సంతోషంతో. "అరెరె! మీ మరదలు పేరు ఇందిరా?" అన్నాడు మరోసారి ఉత్తరంవంక, సంతకంవంక చూస్తూ.

అప్పటికి క్రమేపీ చల్లబడిన కిశోర్ మామూలు ధోరణికి వస్తూ, "అవునూ... ఏం?" అన్నాడు.

"ఏంలేదు. ఇందిరన్న పేరు నాకు చాలా ఇష్టం. మా చెల్లెలికికూడ పట్టుబట్టి, ఆ పేరే పెట్టుకున్నాను చిన్నప్పుడు. అదీ సంగతి!"

"నిజంగా? నీకు ఇందిరనే చెల్లెలుకూడ వుందన్నమాట?" ఆశ్చర్యపోయాడు కిశోర్.

"ఊఁ... మా 'ఇందు' కూడ నేను ఉద్యోగంలో చేరినప్పటినుండి ఇక్కడికి వస్తాననే అంటూంది. కాని... ప్చ్!" నిట్టూర్చాడు రమేష్.

"ఏం?" పేదరికంలో ఎదురయ్యే ఎన్నో రకాల కష్టనిష్ఠూరాల నెరుగని ఆ గర్భ శ్రీమంతుడైన కిశోర్‌కి రమేష్ నిట్టూర్పెందుకో అర్థంకాక అడిగాడు.

ఓ క్షణం అతడివంక ఏదోలా చూసి, "అబ్బే! ఏంలేదు." అంటూ అంతకుమించి మరేం చెప్పటం ఇష్టంలేని రమేష్ మౌనం, అతడిలో ఏవేవో సంశయాలు రేపింది. 'బహుశా తను అతడి రూమ్‌మేట్‌గా వుండటంవల్ల, తన చెల్లెల్నిక్కడికి తీసుకొచ్చేందుకు సంశయిస్తున్నాడేమో! నిజానికి తన ప్రోద్బలంవల్లనేగా ఇద్దరూ ఒకే రూమ్‌లో వుండటం జరిగింది. మొదట్లో అతడుండే సింగిల్ రూమ్ ఖాళీ చేయించి, కొంచెం విశాలంగా, మరింత సౌకర్యంగా వున్న ఈ యింటిని కొంచెం అద్దె

ఎక్కువైనా తీసుకున్నాడు తను, రమేష్ కాళ్ళే ఋష్యం లేకున్నా! ఆనాటి రమేష్ అయిష్టానికి ఇంకెన్ని కారణాలున్నాయో? ప్చ్! పూర్‌ఫెలో! ఎంత మనసులు కలిసిన స్నేహంలోనైనా కొన్ని సంశయాలు, సందేహాలు చోటుచేసుకునే వుంటాయన్నమాట!' అనుకున్నాడు తనలో.

* * *

అసలు కథేమిటంటే...

అనగా అనగా ఓ ఆఫీసులో గుమస్తా పదవిలో నున్న రమేష్ అనే అబ్బాయికి, కిశోర్ అనే అబ్బాయితో చిత్రంగానే స్నేహం కుదిరింది. నిజానికి ప్రతి వ్యక్తికీ మరో వ్యక్తితో జరిగే పరిచయం... ఎవరిది వారికి చిత్రంగానే వుంటుందనుకోండి. సరే! స్నేహం కుదిరింది. జీవనోపాధికి కాకున్నా, పురుష లక్షణాన్ని తనలాంటివాళ్ళు తండ్రి ఆస్తి చూసుకుని వదిలేస్తే, స్త్రీలు ఆయా స్థానాల్నాక్రమించి, 'ఉద్యోగం కేవలం స్త్రీ లక్షణం'గా మార్చేస్తారనే భయంతో ఓ ఉద్యోగాన్నన్వేషిస్తూ ఓ డిగ్రీని చంకలో పెట్టుకుని భాగ్యనగరంలో వాలిన కిశోర్... రమేష్‌తో అనుకోకుండా ఓ హోటల్లో ముఖ పరిచయాన్నీ, మరో థియేటర్లో ఏదో టికెట్ల సందర్భంగా వాక్పరిచయాన్నీ... ఏర్పరచుకొని, మరోసారి మరో పార్కులో కలిసి తమ పరిచయాన్ని మరింత పెంపొందించుకుని, చివరికి ఒక్క ఇంటిలో వుండి ఒకే మంచంపై పడుకునేంత వరకూ వచ్చారు. ఎటొచ్చీ ఒకే కంచంలో తినే అవకాశాన్ని మాత్రం హోటలువాడు కలిగించలేదంతే!

వచ్చి ఐదారు నెల్లయినా... ఉద్యోగం దొరక్కపోయినా, క్రికెట్ ఛాంపియన్ కావటంతో, అప్పుడప్పుడు ఎక్కడ క్రికెట్‌మేచ్ జరుగుతోందని తెలిసినా అందులో పాల్గొని నలుగురిలో గుర్తింపతగ్గ పేరును, పేరుతోపాటు బహుమతులను కూడ సంపాదించసాగిన కిశోర్ కిప్పుడు ఎక్కడో ఢిల్లీలో జరిగే క్రికెట్ పోటీల కాహ్వానమందింది.

అది అందిన, అతడంగీకరించేసిన తరుపరే వచ్చింది లేఖ!

ప్రయాణం మర్నాడే!

'ముందు నుయ్యి, వెనక గొయ్యి'గా వుందతడి స్థితి!

రాత్రంతా ఏకధ్యాన్నంగా ఆలోచించిన పిమ్మట... 'నూతిలోనైతే నీటికని వచ్చినవారెవరైనా చూసి రక్షించవచ్చునీ, గోతిలో పడ్తే చూసే దిక్కయినా వుండే అవకాశం లేదనీ...' కాబోలు ముందుకే పోదల్చుకున్నాడు.

'ఇందిర వచ్చినా తనకు మారుగా రమేష్ వున్నాడు. కనుక తనొచ్చేవరకూ ఏ లోపం కలుగకుండా చూస్తాడు. ఆ తర్వాత... తనొచ్చాక... ఊరంతా జోరుగా... హుషారుగా... షికారు పోవచ్చు!'

* * *

మర్నాడు అనుకున్నట్టుగానే రోజంతా ప్రయాణ సన్నాహంలో వున్న కిశోర్‌ని చూసి, "అయితే వెళ్లటానికే నిశ్చయించుకున్నావన్న మాట?" అన్నాడు రమేష్ తాపీగా.

"అన్న మాటేమిటి? కనిపిస్తున్న మాటే!" అన్నాడు కిశోర్ సూట్‌కేసు ఎడాపెడా సర్దేసుకుంటూ.

ఆ రాత్రి ట్రైన్‌లో కూర్చుని ట్రైను కదిలేంతవరకూ ప్లాట్‌ఫారంమీద నిల్చున్న రమేష్‌తో 'ఇందిర వస్తే అతడెలా మర్యాద చేయాలో, ఇందిర స్వభావ విశేషాలు, చలాకీతనం...' ఇత్యాది గుణ విశేషాల కోసహా వర్ణించి వర్ణించి, అంతా వివరించినాక, ట్రైను కదులుతూంటే, "జాగ్రత్త! మా ఇందిర..." అంటూనే వున్నాడు.

అంత్రకితం చెప్పినదే నిద్రమత్తులో వింటూ, పరధ్యానంగా "ఊఁ" కొడుతూన్న రమేష్‌కింకా, ఆ కదిలే రైల్లోంచి రైలు కూతతోపాటు అతడేం చెప్పాడో ఎలా అర్థమౌతుంది?

* * *

నాలుగురోజులు ఇంట్లో మరో వ్యక్తి లేక, నిశ్శబ్దంగా గడిచాయి.

ఆ రోజు ఆదివారం. ఈజీచైర్లో ఈజీగా వాలి, తీరిగ్గా ఏదో పుస్తకం చేతిలో పట్టుకుని దీక్షగా చదువుతూ కూర్చుని వున్నాడు రమేష్. ఇంతలో తలుపు దబదబా చప్పుడు కావటంతో అతడి చదువుకంతరాయం కలిగింది.

'వేదన గోల' ఎప్పుడూ ఈ ఆఫీసు గొడవలూ, ఫైల్సూ... వుండనే వుంటాయి. అవి లేకుంటే కిశోర్ గాడుంటే క్షణం ప్రశాంతంగా వుండనివ్వడు. ఎప్పుడూ ఏదో వాగుతూనే వుంటాడు విశ్రాంతి లేకుండా. అలా వాగేందుకు వాళ్లమ్మ చిన్నప్పుడెన్ని హార్లిక్సులూ, గ్లూకోజ్‌లూ, ఓవల్టీన్‌లూపట్టిందో గాని, ఆ శక్తంతా అలా వాగేందుకే వినియోగిస్తాడు తన దుంప తెంచడానికి. ఇవాళేదో వాడూలేడు, ఫైల్స్ గోడూ లేవనుకుంటే ఈ తలుపు చప్పుళ్ల గోలొకటి మధ్య! ఎవరో ఒకరు ఎందుకో ఒకదానికి తలుపులు తడ్తూనే వుంటారు. పాలవాడి బాకీ తీర్చలేదింకా. వాడేమో? లేకుంటే తనకు అప్పులిచ్చేదాతల్లో మరొకడా యిపుడు? ఇందాకనే ఒకడు వచ్చి వెళ్లాడు. ఇప్పుడెవరో... ఏమో? అబ్బా... అవతల తలుపు విరిగిపోయేట్టు ఎవరో బాదుతున్నారు. ఎక్కడ ఎవరి కొంప మునిగిపోయిందో మరి?'

చేతిలోని పుస్తకాన్నవతల పడేసి తలుపు తెరిచే లోపల రమేష్ హృదయంలో సుళ్ళు తిరిగిన భావ పరంపర యిది!

విసురుగా తెరచిన తలుపుల కావలనున్నది పాలవాడూ కాదు. నీళ్లవాడూ కాదు. అప్పులవాడంతకన్నా కాదు.

తెల్లచీర కట్టుకున్న, మల్లెపూలు పెట్టుకొని, ఎవరో కాటుక కన్నుల చిన్నది బెదురుచూపులతో, చేతిలో ఓ చిన్న సూట్‌కేసుతో నిల్చుని వుంది.

తెల్లబోయాడు రమేష్.

ఓ క్షణకాలం స్తంభించిన మెదడు చురుగ్గా పనిచేయ నారంభించింది.

అప్పుడు హఠాత్తుగా గుర్తు వచ్చిందావిడ ఎవరో!

'అన్నట్టు ఈ రెండు మూడురోజుల్లో ఎప్పుడో ఇందిర వస్తుందని, స్టేషన్ దగ్గరకెళ్తాండమనీ కిశోర్‌గాడు అంతగా చెప్తే తను ఈ నవలలూ, ఫైల్సూ గొడవల్లో పడి ఆ విషయమే మరచిపోయాడు. ఎంత పనయింది? పాపం... ఇల్లెలా కనుక్కోగలిగిందో?' నొచ్చుకుంటూ ఆమెవైపు చూసి, "మీరా!" అన్నాడు పలకరింపుగా. అంతకు మించి ఎలా మాట్లాడాలో పరాయి ఆడవాళ్లతో అట్టే పరిచయంలేని రమేష్‌కి తోచలేదు.

ఆమె వింతగా చూసిందతడ్ని.

బయట ఎండ మండిపోతూంది. ఈనరుగు అసలే చిన్నది కావటం వల్ల ఎండ ఏటవాలుగా ఆమెపైనే ప్రసరిస్తూండటంతో, తన సంకోచాన్ని వెనక్కినెట్టి కర్తవ్యాన్ని స్ఫురణకు తెచ్చుకుని, "లోపలికి రండమ్మా ముందు. ఎండ పడుతోంది" అంటూ లోనికి దారితీసాడు.

ఆమె దిక్కులు చూస్తూ తడబడుతూ లోనికి వచ్చింది.

రమేష్ గబగబా రూమంతా చెల్లాచెదరుగా పడున్న పుస్తకాలనన్నింటినీ ఏరి టేబిల్‌పై దొంతరగాపెట్టి, ఓ కుర్చీ చూపాడామెను కూర్చోమన్నట్టుగా.

కాని ఆమె కూర్చోలేదు. బెదురుచూపులతో ఇల్లంతా పరిశీలిస్తూనే వుంది.

ఆమె చూపులనూ, సంశయాన్నీ గమనించిన రమేష్‌కి తన పొరపాటేమిటో తెలిసివచ్చింది. 'ఆమె పాపం రాకరాక వచ్చిందిక్కడికి. ఆమె దురదృష్టమూని, ఇప్పుడే వాడటు వెళ్లాల్సి వచ్చింది. ఇంతకూ కిశోర్ చెప్పబట్టి, ఆమె చెప్పుకున్నా... ఆమె ఎవరో తను అర్థం చేసుకోగలిగాడు కాని, తనెవరో ఆమెకేం తెలుసు పాపం! తన ప్రయాణం గూర్చి కిశోర్ లెటర్ ద్వారానైనా ఆమెకు చెప్పలేదయె! రాక రాక వస్తానని వ్రాసిన మరదలికి 'నేనుండను. రావద్ద'ని వ్రాస్తే, అసలే ముక్కుమీద కోపం ఎక్కువైన ఆ మరదలికి ఒళ్లమండి మళ్లీ అలా వచ్చే ప్రయత్నమే చెయ్యదట. అదీ భయం కిశోర్‌కి. 'ఎలానూ ఆమె వచ్చేసరికి కొన్నాళ్ళు పడ్తుంది. ఆమె వచ్చిన కొద్దిరోజులకి తను వచ్చేస్తాడు. ఇంకేం? ఆ మాత్రం దానికి రావద్దని

---

త్రి

డా॥ దాశరథి

కాల జ్వాలలు
గళాన మాలలు;
యెలా వుంచడం?
యెలా తెంచడం?

* * *

జీవితమొక వింత ప్రహేళిక
ఒకప్పుడు కాళిక; ఒకప్పుడు కేళిక.

* * *

పరిమళాన్ని నేను; పట్టి పువ్వునుకాను
వసివాడిపోతానని భయపడబోను.

---

వ్రాయటమెందుకూ ?' అని వాడి ఊహ. ఇంతకూ ఇంటికి వస్తూనే తను ఎదురుచూసే వ్యక్తి కాక, ముక్కూ ముఖం తెలియని తాను కూర్చోమనగానే తెల్లబోక నల్లబోతుందా ?'

అలా అనుకున్నాక ఆ వెంటనే ఓ అందమైన చిరునవ్వును తన ముఖాన పులుముకున్నాడతడు. ఆ చిరునవ్వులో ఆప్యాయత ఓ ఔన్సు, అభిమానం మరో రెండౌన్సులూ కలిపి ప్రదర్శిస్తూ, ముందుగా తనను తాను ఆమెకు పరిచయం చేసుకున్నాడు. స్టేషన్ దగ్గరకు రాలేకపోయినందుకు కారణం కూడ చెప్పి క్షమార్పణలు కోరాడు.

ఆపైన ఇంకా ఇలా అన్నాడు: "కిశోర్ లేకుంటే ఏమ్మా ? మీరు మా అతిథులు. తను వచ్చేవరకూ మీకు అతిథి సత్కారాలకే లోటూ రానివ్వకూడదని మాట తీసుకుని మరీ ... రైలెక్కాడు మా వాడు. అంచేత మీరిక్కడ ఏ మొహమాటమూ పడకూడదు. మరో వారం పదిరోజుల్లో వాడెలామా వస్తాడు. ఆ తర్వాత ఈ భాగ్యనగరమంతా మీ ఇష్టంవచ్చేట్టు చూసేయొచ్చు. ఏమంటారు ?"...'తనూ ఆమెను చూసి మొహమాటపడితే ఆమె ఇప్పుడే మళ్ళీ ట్రైన్ ఎక్కేసేలా వుంది. ఆపైన కిశోర్ వచ్చాక వాడి తిట్ల వర్షం వినే సహసం తనకు లేదు.' అందుకనే తనే చనువు తీసుకొని ఆమె సంకోచాన్ని తొలగించటానికి పూనుకున్నాడు.

ఎలాగైతేనేం ఆమె మెల్లగా కుర్చీలో కూర్చుంది. ఇప్పుడామె ముఖంలో భయచిహ్నాలు చాలావరకు అంతరించాయి.

తనూ మరో కుర్చీలో కూర్చుని కిశోర్

## మళ్ళీ ఎప్పుడో... ఎక్కడో

వివరాలు, తమ స్నేహం గూర్చి చెపుతూనే మధ్యలో మరోసారి ఆమెను వేడుకున్నాడు – "నేను స్టేషన్‌కి రాలేదని మీరేం అనుకోరు కదూ ? ఒకవేళ అనుకున్నా మనసులోనే ఎన్నైనా అనేసుకోండిగాని, మీ బావతో చెప్పకండేం ? నా ప్రాణం తీసేస్తాడు" అంటూ నవ్వాడు రమేష్.

అంతలోనే అతడి దృష్టి అంతవరకూ ఓ వైపు నవల చదువుతూనే, మరోవైపు అదే వూపుతో పేల్చిపారేసిన సిగరెట్టు పీకలపై పడింది.

వెంటనే కంగారుపడి ఆమె గమనించకుండా, మాటలమధ్య కాలితో వాటిని తను కూర్చున్న కుర్చీ క్రిందకు త్రోసేయసాగాడు. 'ఇందిరకు సిగరెట్టంటేనే ఎలర్జీట. అందుకే కిశోర్ సిగరెట్ల జోలికే పోడట !'

అతడి కంగారునూ, ఆ ప్రవర్తననూ ఓ కంట చూస్తూ, అతడు చెప్పేది వింటున్న ఆమె తన బెదురుపాటును వెనక్కినెట్టి నవ్వకుండా వుండలేక పోయింది. అప్పటికిగాని ఆమె ఫ్రీగా మూవ్ కాలేక పోయింది

"చూడండి. నేనిన్ని మాటలు చెప్పానుగాని, మీరు నోరు విప్పనేలేదు. నన్నో అన్నయ్యగా భావించి కిశోర్ వచ్చేవరకూ ఏ మొహమాటమూ లేకుండా వుంటే నేను చాలా సంతోషిస్తాను. అన్నట్టు అన్నయ్యంటే గుర్తొచ్చింది. నాకో చెల్లెలు కూడ వుంది. విశేషమేమిటంటే... ఆ చెల్లెలిది కూడ మీ పేరే !..." మళ్లీ తనే అన్నాడు రమేష్.

"నా పేరా ?" ఆశ్చర్యంతో అప్పటికి పెదవులు విప్పిందామె.

"అవునండి. మా చెల్లెలి పేరుకూడ ఇందిరే ! మా ఇందిరకు నేనంటే అమిత ప్రేమ..." అంటూ ఏదో చెప్పబోయి ఆగి, "ఆఁ... అదిసరే ! మిమ్మల్ని కూడ మీ పేరుతోనే సంబోధిస్తే... మీకేమన్నా అభ్యంతరమా ?" అడిగాడు.

కొద్దిసేపు ఎటో చూస్తూ మౌనంగా కూర్చున్న ఆమె, మరో రెండు నిమిషాలకు సమాధానం చెప్పింది తల అడ్డంగా వూపుతూ "ఉహుఁ..." అని. అంతే !

"అరె ! మిమ్మల్నిక్కడే కూర్చోపెట్టేసాను భోజనమదీ ఏర్పాటు చేయకుండా ! లేవండి. అదిగో ! బాత్‌రూం. స్నానం చేస్తారో, ముఖం కడుక్కుంటారో మీ యిష్టం. ఈలోగా, నేను కారియర్ తెస్తాను హోటలునుండి." అంటూ లేచి, కొక్కానికి వ్రేలాడుతున్న స్టీలు కేరియర్ అందుకుంటూన్న రమేష్‌కి "అన్నగారూ" అనే ఆమె పిలుపు వినపడటంతో తలత్రిప్పి ఆమె వంక చూశాడు.

"ఏంలేదు. నన్ను మీ చెల్లెలిగా అభిమానిస్తూ 'మీరు' అంటూ మన్నించడం ఏం బాగాలేదు. దయచేసి ..."ఆమె అర్థిస్తున్నట్టుగా చెప్పబోయింది.

"ఓహ్ ! అదా ! మీరేం అనుకు...అహ... సారీ ! నువ్వేం అనుకుంటావోనని అలా అన్నాను. ఇకపై అలా పిలువనుగా ?" అంటూ నవ్వాడు రమేష్.

"ఫర్లేదు అన్నగారూ ! నేనేం అనుకున్నా







మనసులోనే అనుకుంటాను. మా బావతో చెప్పను లెండి'' తనూ నవ్వుతూనే అంది.

ఫకాలున నవ్వేసాడు రమేష్.

''భలేదానివమ్మా. నా మాటలు నాకే అప్పజెప్పేశావు. మరి అన్నయ్యను మాత్రం 'గారూ' 'మీరూ' అని మన్నిస్తారేమిటి ?'' చిలిపిగా అడిగాడు.

''క్షమించండన్నయ్యా! ఇకనుండి ఆ పొరపాటు కూడ జరగదు'' హామీ యిస్తూ లేచిందామె.

*   *   *

''ఇందిరా !''

''ఎస్తున్నానన్నయ్యా!'' స్నానంచేసి చీర మార్చుకుని వచ్చిందామె.

''భోజనం రెడీ ... '' కేరియర్‌ని టేబిల్‌పై పెట్టాడు రమేష్.

''తింటానికి నేనూ రెడీయే...'' చిరునవ్వుతో వచ్చి టేబిల్‌కి దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చుందామె.

ఈ పదినిమిషాల సంభాషణతోనే పదేళ్ల అనుబంధం ఏర్పడిపోయింది వారిమధ్య. ఆడవారితో కాకున్నా పదిమంది స్నేహితులతో ఇట్టే చనువుగా కలిసిపోయే రమేష్ వాక్చాతుర్యమే దానిక్కారణం.

కేరియర్ విప్పి హుషారుగా వడ్డించబోయాడు రమేష్.

''ఆహాఁ...ఆడవాళ్లుండగా మగాళ్ళు వడ్డించ రాదు'' కేరియర్‌ని తనే అందుకుందామె చొరవగా.

''ఏమిటమ్మోయ్ ! రూల్సు జారీచేస్తున్నావు? ఏమో అనుకున్నానుగానీ మా కిశోర్ చెప్పింది నిజమేనమ్మా !'' ఆమె కేరియర్‌లోంచి అన్నం మరో ప్లేటులోకి తీస్తుంటే విచిత్రంగా ఆమెనే చూస్తూ అన్నాడు రమేష్.

''ఏం చెప్పాడేం ?'' తల దించుకొని తన పని కానిస్తూనే అడిగిందామె.

''మా మరదలు గడుగ్గాయి. చూట్టానికి అమాయకంగా కనిపించినా వాగుడులో నాకు తాతయ్య ... సారీ ... నాయనమ్మలాంటిది. అసలు నేను మూగవాడ్నిగా పుట్టానట. మా ఇందిర పుట్టాక, ఇద్దరం కలిసి ఆడుకున్నరోజులలో ఇందిర వాగుడు వల్ల నాకూ హఠాత్తుగా మాటలు వచ్చేసాయిట !' అనేవాడు మా కిశోర్. అదంతా మరదలిపై అభిమానంతో చెప్పిన కట్టుకథను కున్నానుగాని, ఇప్పుడు అదంతా నిజమని నమ్మాల్సి వస్తోంది మరి !''

కిలకిలా నవ్విందామె.

''మరో విషయంకూడ చెప్పాడు మరి !''

''ఏమిటో ?''

'''మా ఇందూ నవ్వితే ఎంతందంగా వుంటుందో తెలుసా ?' అని. 'నోర్మూయ్యవోయ్ ! కాబోయే పెళ్లామని మరీ కోతలు కోస్తున్నావు' అనేసేవాడ్ని. కాని కిశోర్ చెప్పేదంతా నిజ్జంగా నిజమే !''

''సరేగానన్నయ్యా ! ఇక మీరూ కూర్చోండి.''

''ఎందుకూ ? భోజనానికా ?''

''ఆఁ... ఏం ?''

''చెప్పాముగా ! నువ్వొస్తానే విషయమే మరచిపోయి హాయిగా భోజనం చేసేసే రెస్టు తీసుకుంటున్నా. పొరపాటే జరిగిపోయింది. మీ బావకి తెలిస్తే...''

''మా బావంటే అంత హడలన్నమాట ?'' నవ్వి అడిగిందామె.

''అహా...నాకా భయం ? అబ్బే...నాకెందుకూ భయం ?'' కాలర్ సర్దుకుంటూ తడబాటుతో అంటూన్న అతడ్ని చూస్తూ మరోసారి పకపకా నవ్విందామె.

*   *   *

ఆ రాత్రి భోజనాలయేక, మాటలమధ్య అడిగింది ఇందిర ''మీరేం చేస్తుంటారన్నయ్యా ?'' అని.

''ఏముంది ? గాడిద చాకిరీ... ఐ మీన్... గుమస్తా చాకిరీ'' నవ్వుతూ అన్నాడు రమేష్.

కొద్దిక్షణాలు నిశ్శబ్దానికి చోటిచ్చాక, రమేషే అడిగాడు మళ్లీ ''ఏమిటమ్మా అంతలా ఆలోచిస్తున్నావు ?'' అని.

''అబ్బే. ఏంలేదు.'' సంశయించింది ఇందిర

''నువ్వు ఏంలేదన్నా, నీ ఆలోచనలని క్షణంలో పసిగట్టేయగలను. నువ్వు ఆలోచిస్తున్నదేమిటో చెప్పేయనా ?''

కుతూహలంగా చెవులు రిక్కించింది ఇందిర.

''...'మా బావ ఎప్పుడొస్తాడబ్బా ?' అని ! ఔనా ?'' ఏదో మహత్తర విషయం కనిపెట్టేసినట్టున్నాడు రమేష్ నవ్వుతూ.

''ఛ ! అదేం కాదులే !'' బుంగమూతి పెట్టిందామె.

*   *   *

వారం రోజులు సరదాగా గడిచిపోయాయి. ఇందిర కూడా పసి మనస్తత్వం గల రమేష్‌తో ఇట్టే కలిసిపోయి, చొరవగా రోజులు దొర్లించేయగలిగింది.

ఆ రోజు సాయంత్రం రమేష్ ఆఫీసునుండి వచ్చేసరికి కనిపించిన దృశ్యమిది !

కిశోర్ అప్పుడే వూరినుండి వచ్చినట్టున్నాడు. చేతిలో ఇంకా సూట్‌కేసు వుంది ఇందిర కూడ అప్పుడే స్నానంచేసి వచ్చినట్టుంది. తడిసిన చీర ఆరవేసుకుంటూ ఎదురుగానే ఓ విధమైన కొంటె నవ్వుతో, అందులో కొంత ఆశ్చర్యంపాలు కలబోసి మరీ నిలబడివుంది. 'బావా మరదళ్ళు మంచి మూడ్‌లో వున్నట్టున్నారే! ప్రస్తుతం తన కర్తవ్య మేమిటి ?' అనుకుంటూనే తప్పనిసరైనట్టుగా ...

''అరె! ఏమిట్రా ఇంత హఠాత్తుగా దిగబడ్డావ్ ?'' అన్నాను వెనుకనుండి కిశోర్ వీపుపై గట్టిగా చరుస్తూ.

ఉలిక్కిపడి తిరిగి చూశాడు కిశోర్.

''ఏమిట్రా ఆ చూపులు ? దిష్టి తగిలేను మా చెల్లాయికి. ఎంతసేపయింది నువొచ్చి ? ఇందిరా ! నువ్వు ఏమిటలా మౌనంగా నిల్చున్నావు? మీ ఇద్దరి వంతు కబుర్లూ మిమ్మల్ని విడిచి, సహవాస దోషంవల్ల నాకు అబ్బినట్టున్నాయి. ఆ సూట్‌కేస్ లోపల పెట్టేసి, నీ చేత్తో ఓ రెండు కప్పుల వేడినీళ్ళు మా ముఖాన పడేయి తల్లీ !'' రమేష్ చకచకా మాట్లాడుతుంటే, నవ్వుకుంటూ లోనికి నడిచింది ఇందిర.

''అన్నట్టు చెప్పటం మరిచాను. నాకు గొప్ప మతిమరపు జబ్బు పట్టుకుందోయ్. చెల్లాయి వచ్చే ముందు ఉత్తరం వ్రాసిందా ? అయినా స్టేషన్ కెళ్లటం కూడ మరచిపోయాను. పాపం ... తనే ఎలాగోలా వెదుక్కుంటూ మరీ ఇల్లు చేరుకుంది'' చెప్పాడు రమేష్ సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు.

కిశోర్ ఎందుచేతో సమాధానం చెప్పలేదు. తర్వాత కూడా మళ్లీ ఆ ప్రసక్తి ఎత్తలేదుగానీ, వేడి వేడి కాఫీ గొంతు దిగాక, తన క్రికెట్ కబుర్లు చెపుతూ కూర్చున్నాడు.

కబుర్ల మధ్య రమేష్ మరోసారి అన్నాడు ''అన్నట్టు ఇందిర వచ్చేక, హోటల్ సాపాటుకు గుడ్‌బై చెప్పేశానోయ్ ! ఇన్నాళ్లకు మన వంట పాత్రలకు, వంటింటికీ మోక్షం లభించిందనుకో !

ఇందిర వంట బ్రహ్మాండంగా చేస్తుంది మనూ ?'' అని.

''అలాగా ?'' అన్నాడు కిశోర్.

రమేష్ ఓ సారి వింతగా చూసాడతన్ని. 'ఏమిటబ్బా వీడి ధోరణి ! ఇందిర వస్తుందని వూరికే తెగ సంబరపడిపోయాడు రాకముందు. వచ్చేక ముఖం మాడ్చుకున్నాడేం ? ఏం జరిగింది ? కొంప తీసి ఢిల్లీ ప్రయాణంలో తారసపడిన మరే అమ్మాయినో ఇందిరను మరచిపోయి ఘాటుగా ప్రేమించేసెయ్య లేదుకదా ? ఒకవేళ అంతపనీ జరిగినా...మరదలితో సరదాగా మాట్లాడటానికేం? పోనీ ... సరదాగా కాకపోయినా మామూలుగా మాట్లాడవచ్చుగా? ఒకవేళ తను ఆఫీసునుండి రాక ముందు ఊరినుండి తిరిగివచ్చిన కిశోర్, ఇందిరా ఏ విషయంపైనో ఘర్షణపడలేదు కదా? అసలే ఇందిర కోపిష్ఠి అని చెప్పేవున్నాడు కిశోర్. ఏమో... తనకు తెలిసినంతవరకూ ఇందిర సౌమ్యురాలే ! మరి... ఏమో ?' తల గోక్కున్నాడు రమేష్ తనలో మొలకెత్తే ఈ 'ఏమో' లకు సమాధానం ఏంచెప్పాలో తోచక.

ఆ రాత్రి భోజనాలు కూడ ఇందిర ఎదుట మౌనంగానే ముగించారిద్దరూ. 'తను రాకముందు ఏదో జరిగేవుంటుంది !' అని గట్టిగా నిర్ధారించు కున్న రమేష్ ఉండబట్టలేక, కిశోర్ భోజనం ముగించి ప్రక్క గదిలోకి వెళ్ళిపోయాక, మెల్లగా తన సందేహాన్ని ఇందిర ఎదుట వెల్లడిచేశాడు.

అంతా విని ఇందిర నవ్వేసింది.

''అది ఒకరకం బెట్టు అన్నయ్యా ! నీకు తెలియదు బావ సంగతి. ఇద్దరికీ ఒకరిపై ఒకరికి ఎంత అనురాగం వున్నా... ప్రతి విషయానికీ మా యిద్దరి మధ్య వాదనలూ, పోట్లాటలే ఎక్కువ ! దాన్ననుసరించి ఈ బెట్టు, పంతం కూడ వుంటూనే వుంటాయి. అదీ సంగతి ! నువ్వేం మా విషయంలో కలుగజేసుకోవద్దు. బావకు ఏ సలహాలు చెప్పనూవద్దు. విన్నావా మరి ?'' అంది హెచ్చరికగా.

''ఏం ? సంగతి తెలుసుకుని, తప్పైతే సలహా చెప్పొచ్చుగా ?''

## మళ్ళీ ఎప్పుడో... ఎక్కడో

''ఊహూ... మనం చెప్పే కొద్దీ మరీ నెత్తెక్కుతాడు బావ ఇలా మనమూ పట్టేపట్ట కుంటే తనే దిగివస్తాడు. అదీ సంగతి !''

''అసలూ... ఏం జరిగి...''

రమేష్ వాక్యం పూర్తికాకముందే... ''నేను వచ్చేసరికి తను ఊళ్లో లేకుండా ఎక్కడికో పారిపోయాడుగా ! అందుకని చివాట్లు వేశాను. అందుకూ... ఆ ముఖావం ! నువ్వు వచ్చేసరికి ఏం ఎరగనట్టు తాపీగా సూట్‌కేసు అందించి ముఖం మాడ్చుకు కూర్చున్నాడు. సరేగాని నేను చెప్పింది గుర్తుందా ?'' అంది మరోసారి, ప్రక్క గదిలోకి విన్పడకుండా మెల్లగా.

''ఏది ?'' అన్నాడు చేతిలో అన్నంముద్ద పట్టుకుని నోరు వెళ్లబెట్టి ''స్తూ.

''అదే... ఈ విషయంలో బావ ప్రవర్తన చూసి నువ్వేమీ అడగవద్దు. అంతా చూస్తూండు. అంతే !''

''ఏమిటో మీ గోల ! సరే నాకేం ?'' అప్పైన మాటలు పెంచలేదు రమేష్.

* * *

మరో వారం రోజులు గడిచిపోయాయి అతిసాధారణంగా !

ఈ వారం రోజులుగా ఆ ఇంట్లో... వారిద్దరిలో నీ మార్పూ కనిపించలేదు రమేష్‌కి. ఊరు చూట్టానికి వచ్చిన ఇందిర గడప దాటలేదింత వరకూ. కిశోర్ సాధ్యమైనంతవరకూ ఇంట్లో తక్కువ సమయం గడుపుతున్నాడు. ఒక్కోసారి రాత్రిళ్లు కూడ యింట్లోకి రావటంలేదు. ఇందిర ఎదురుపడినా, ఏదో ఒకటి రెండు ముక్కలు అంటీ అంటనట్టు మాట్లాడుతున్నాడు. తనతోకూడదివరకు ఇదివరకట్లా మాటలు పెంచటంలేదు. అంతా విచిత్రంగా, అయోమయంగా వుంది ఢిల్లీ నుండి వచ్చాక కిశోర్ ప్రవర్తన. ఏదో చుట్టపు చూపుగా తన దగ్గరకు వచ్చిన అమ్మాయిపై మరీ అంతలా బెట్టు చూపడం రమేష్‌కి సుతరామూ నచ్చలేదు. 'ఏది ఏమైనా, ఇందిర ఏమన్నా, తనే ఏదో ఓ ఏర్పాటుచేసి వాళ్లిద్దరి పంతాలూ – పట్టింపులు సడలించాలి. పాపం ! ఎన్నాళ్లిలా ఆ అమ్మాయి బాధ పడేది ? ఇంకొన్నాళ్లుపోతే, సెలవులు పూర్తై ఆమె వెళ్లిపోనూవచ్చు' అనుకుంటూ, ఓ సా కిశోర్ సావకాశంగా కూర్చున్నప్పుడు, ''ఇందిరనోసా అలా వూరంతా తిప్పి తేరాదూ ?'' అన్నాడు ఉపోద్ఘాతంగా.

''నేనా!?'' అన్నాడు కిశోర్ అదోలా చూస్తూ.

''కాకుంటే ... మరినేనా ??'' అన్నాడు ఒళ్లుమండిన రమేష్.

''అదికాదు రమేష్ ! ... '' ఏదో చెప్ప బోయాడు కిశోర్.

''మరింకేం చెప్పకు. వచ్చి యిన్నిరోజులైంది. పాపం ... ఒక్క చోటికైనా తీసికెళ్లావా ? ఒక్క రోజైనా కాసిని పూలు పట్టుకొచ్చివుంటే నీ సొమ్మేం పోయి వుండేది ?'' మాటల్లో దులిపేశాడు రమేష్ కోపంగా.

''మీ చెల్లాయి ఇష్టాయిష్టాలు నాకేం తెలుసోయ్ ?'' కించిత్ ఆశ్చర్యంతో ప్రశ్నించాడు కిశోర్.

''ఎంత చెల్లాయైనా ముందు నీ తర్వాతేగా ? ఆమె ఇష్టాయిష్టాల్ని నీతో ఎప్పుడూ చెప్పలేదా ?''

''ఎంత స్నేహితుడి చెల్లాయైనా, తన స్వవిషయాలన్నీ పరాయి వ్యక్తితో చెప్తుందా ?'' తనూ అతడ్ననుకరిస్తూనే అన్నాడు కిశోర్.

చిత్రంగా చూశాడు రమేష్.

''స్నేహితుడి చెల్లాయీ ... పరాయి వ్యక్తీ...! ఏమిట్రా నీ డైలాగ్స్ ?'' అన్నాడు తన చిత్రమైన చూపుకు తగిన వాఖ్యానాన్ని వినిపిస్తూ.

''ఆఫ్‌కోర్సు ... నువ్వు నన్ను పరాయిగా చూడటం లేదనుకో. అదికాదు నేననేది ... '' ఏదో చెప్పబోయేడు కిశోర్ రమేష్ మాటలకు మరో అర్థాన్ని తీసుకుంటూ.

కాని రమేష్‌కి మాత్రం లీలగా ఏదో అనుమానం వచ్చింది. అందుకే విడమర్చి మరీ అన్నాడు. ''అదేమిట్రా ! రేపో మాపో కాబోయే పెళ్లానికి...నీ 'స్వంత' మరదలికి, ఆనాడు ఉత్తరం వచ్చినప్పటినుండి మా ఇందిర వస్తుందని ఊరికే గంతులేసిన 'నువ్వు' ... ఈనాడు పరాయి వాడవా ? అదెట్లా ?'' ఒకే ఊపున అనేసి అప్పుడు ఊపిరి పీల్చుకున్నాడు రమేష్.

కాని, ఇప్పుడు కిశోర్‌కి ఊపిరి స్తంభించిపోయి నట్టయింది. కనుబొమలు ముడిచి, నోట మాట రానట్టు వింతగా రమేష్‌వంక చూస్తుండిపోయాడు.

''అంటే ... అంటే ... ఈ ఇందిర ... మీ స్వంత చెల్లాయి ... '' కిశోర్ ప్రశ్న సగంలోనే ఆగిపోయింది. ఇద్దరికీ ఏదో అర్థమైనట్టయి, ఇద్దరూ ఒకర్నొకరు నిలువుగుడ్లు వేస్తూ చూస్తూండిపోయారు ... ఇంటర్వెల్ సమయంలో చిత్రంలోని పాత్రధారులు సడన్‌గా ఆగిపోయి నట్టుగా !!

మరో పావుగంటకు తేప్పరిల్లిన ఇద్దరూ...

''అంటే... ??'' అన్నారు ఒక్కసారిగా కంబైండ్ సాంగ్‌లా.



# సంక్రాంతి సంబరాలు

ఎగిరే గాలిపటాలు, వెచ్చని
భోగిమంటలు, గొబ్బిపాటలు......
ఎటుచూసినా పండుగ సంబరం!
ఆకుపచ్చా- ఆకాశపునీలం-
బంగారు పసుపు- ఇటుక ఎరుపు!
ఈ ఋతువు రంగులు
అలంకరించుకోండి!
ఆప్కో రంగుల రంగవల్లికల్లో
పండుగ పసందుగా గడపండి!
ఆప్కోవారి షర్టింగులూ- చీరలూ,
డ్రెస్ మెటీరియల్స్, రెడీమేడ్స్-
మీకోసం ఇప్పుడు ప్రింటెడ్
పాలియెస్టర్, కాటన్ చెక్స్
మెరిసే సిల్కులు, మరెన్నో
బ్లెండెడ్ రకాల్లో వస్తున్నాయి.
సంక్రాంతి సంబరం- ఆప్కోవస్త్రాల్లో

**20%**
రిబేటు
13-1-82 వరకు

**ఆప్కో చేనేతలు**




KIRON/APCO/8112

"ఇందిర మీ స్వంత చెల్లాయి కాదన్నమాట?" కిశోర్ అన్నాడు.

"ఇందిర మీ స్వంత మరదలు కాదన్నమాట?" రమేష్ కూడ అన్నాడు.

"అందుకేనన్నమాట! మీరిద్దరూ స్వభావం గానే వుంటూవచ్చారు?" రమేష్ ఏదో ఆలోచిస్తూ అన్నాడు.

"నేను లేనప్పుడు వచ్చిన ఆ అమ్మాయిని చూసి, నువ్వు పదే పదే చెల్లాయంటూంటే నిజంగా నీ చెల్లెలేనేమో అనుకున్నా. నేనున్నంత వరకూ ఇక్కడికి తెచ్చేందుకు సందేహించినందుకు, బహుశా నీ చెల్లెలితో పరాయివాళ్లు చనువుగా వుండటం నీ కిష్టం వుండదనే, నేనూ ఎక్కువగా ఆమె వివరాలను గూర్చి ప్రశ్నించలేదు. ఆమెతో చనువు పెంచుకోలేదు. కానీ..."

"ఆర్నీ! ఇవేం ఊహాగానాలురా! మరి వస్తానని వ్రాసిన మీ ఇందిర ఏమయినట్టు?" రమేష్ ప్రశ్న.

"ఢిల్లీ వెళ్లేటప్పుడు ఉండబట్టలేక, నేనే రైల్లో కూర్చుని మా ఇందిరకు ఓ లెటరు వ్రాసి పడేసా... 'నేను తను వచ్చేసరికి ఇంట్లో వుండననీ, తీరా తను వచ్చేక నేను లేకుంటే కోపం రావొచ్చు కనుక ముందే ఈ సంగతి తెలియజేస్తున్నాననీ, అంచేత నే వచ్చాక వీలుచూసుకొని రావచ్చుననీ'ను! ఆ లెటరు చూసి తను ప్రయాణం మానుకుని వుంటుంది. మరి... ఇది ఇలా జరిగిందేమిటి?" కిశోర్ ప్రశ్న.

"అవును. ఇలా జరిగిందేమిటి?" ఇది ఇద్దరి ప్రశ్నను!!

"మరి... ఈ ఇందిర ఎవరో?"

"అసలు... ఈమె పేరు కూడ ఇందిరేనా?"

"ఇంతకూ... ఈమె...?"

ఇలా సమాధానాలులేని ప్రశ్నలు వేసుకుంటూ కూర్చుంటే లాభం లేదనుకుని, ఇద్దరూ ఒక్కసారిగ ఇంట్లోకి నడిచారు.

అంతక్రితం వరకూ వంటింట్లో 'వినబడుతూన్న చప్పుడు ఇప్పుడు వినిపించటంలేదు. ఉన్న మూడు గదులూ వెతికినా ఈ క్రొత్త ఇందిర జాడ కన్పడలేదు. అనుమానంగా ఇల్లంతా పరిశీలనగా చూశారు మిత్రులిద్దరూ.

ఆమె సూట్‌కేసు కన్పడలేదు. ఇద్దరూ ఒక్కసారి త్రుళ్లిపడినట్లయి ఇల్లంతా పరిశీలించిచూ అంతకుమించిన మార్పేం ఇంట్లో కన్పడలేదు. ఎక్కడి వస్తువులక్కడ చెక్కుచెదరకుండా వున్నాయి... వంటింటి టేబిల్‌పై ఇందాక పాలవాడి కిమ్మని ఇందిరకే వప్పగిస్తూ వుంచిన ఏభై రూపాయల నోటుతోసహా.

ఎప్పుడెప్పుడో చదివిన దయ్యాల కధలన్నీ అదే సమయంలో ఒకటొకటిగా గుర్తువచ్చాయి రమేష్‌కి. మనసులో ఏ మూలనో చిన్న వెర్రిలాంటిది చోటు చేసుకుంది ఇద్దరిలోనూ కూడ.

ఆ సాయంత్రం వీధివైపు గల కిటికీకి దగ్గరగా ఏదో పెద్ద కవరు లాంటిది రెపరెపలాడుతుంటే, అనుమానంతో దాన్నందుకొని విప్పాడు రమేష్.

ప్రియమైన రమేష్ అన్నయ్యా!

# మళ్లీ ఎప్పుడో... ఎక్కడో

నీకు నా హృదయపూర్వక నమస్కృతులు.

ఇంచుమించు నెలరోజులపాటు నీకు చెల్లెల్నిగా, మీ యింట ఆతిధ్యాన్ని స్వీకరిస్తూ, మీ అభిమానాన్ని పంచుకుంటూ గడిపిన నేనెవరో తెలుసా అన్నయ్యా? ఈనాడు అనుకోకుండా నేను పారిపోతున్నానంటే అందుక్కారణం ... నేనెవరో, నా వివరాలేమిటో, నా నోటితో నీకు తెలుపలేకనే ... సరే! నోటితో చెప్పలేనిదాన్ని, పనికే వ్రేళ్లమధ్య తడబడే ఈ కలంతోనైనా చెప్పేందుకు ప్రయత్నిస్తా!

ఏం చెప్పను?

నేను ఓ దురదృష్టవంతురాలిని.

పుట్టుకతో కాదు సుమా! పుట్టుకతో సంఘంలో పేరు ప్రతిష్టలున్న ఓ ఉన్నతాధికారి ఏకైక పుత్రికను. అల్లారు ముద్దుగా పెరిగి కాలేజీలో తిరిగి, స్నేహితురాళ్లతో ఉల్లాసంగా సినిమాలు చూస్తూ, అప్పుడప్పుడూ కాలేజీ ఫంక్షన్స్‌లో నాటకాలు వేస్తూ అందరిలాగానే ఆనందంగా రోజులు వెళ్లబుచ్చేదాన్ని! అలా ఆనందంగా గడిచే రోజులలోనే నాలో క్రొత్త క్రొత్త ఊహలు, ఆశలు మొలకెత్తసాగేయి. నా అందం ఆ మొలకలకు ఎరువు కాగా, తగ్గట్టు స్నేహితురాళ్ల ప్రోత్సాహం ఆ మొలకలకు నోరుపోసి అంతకంతకూ చిగురులు తొడిగేలా చేసింది.

ఒకనాడు ఓ పత్రికలో నన్నాకర్షించిందో ప్రకటన. "అందచందాలు గల క్రొత్త నటీనటులు కావాలి" అని. అంతే! 'చిగురులేసిన నా ఊహలు పుష్పించి ఫలించాలంటే ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి!' అనుకున్న నేను, అలా అనుకున్న మరునాడే నన్ను పెంచి పెద్దచేసి నీడనిచ్చిన గూటిని వదిలి తిన్నగా మద్రాసులో వాలాను. కాని ... నేననుకున్నట్టు ఆ చిత్రంలో కధానాయికను కాదుకదా ... కనీసం ఎక్స్‌ట్రా వేషం కూడ దక్కలేదు. ఏ అందమైతే నాకుందని తెగ గర్వపడే దాన్నో ఆ అందం కెమెరాకు పనికిరాదన్నారు కొందరు. స్నేహబృందాన్ని నా చమత్కార సంభాషణతో ఆకట్టుకోగలనన్న నా నమ్మకాని వమ్ము చేస్తూ నా కంఠం బాగాలేదన్నారొకరు. ఇలా ప్రొడ్యూసర్ మొదలు లైట్ బాయ్‌వరకు తలా ఒక సమాధానం చెప్పి నాకే గొప్పతనాలూ లేవనే ఓ భరించరాని సత్యాన్ని వెల్లడించారు మరెక్కడా నా ప్రయత్నాలు సఫలం కాలేదు. సఫలమయ్యేంతవరకూ వేచి వుండేంత సహనం, సఫలమౌతాయనే నమ్మకం మద్రాసులో చేరిన నాలుగు నెలలకే కోల్పోయిన నేను ... అలా సఫలమయ్యేందుకు కొందరు సూచించిన మార్గాలు నచ్చక, మరో నెలరోజులు గడిచేసరికి చేతిలో చిల్లిగవ్వ మిగలకపోవడంతో, ఇంటికి వెళ్లేందుకు ముఖం చెల్లక, చివరికో నిశ్చయానికి వచ్చి చేతిలోని రిస్ట్‌వాచీని అమ్మి ఆ డబ్బుతో ఈ హైదరాబాద్ చేరుకున్నాను. ఇక్కడ ఉద్యోగం చేసుకుంటూన్న ఓ స్నేహితురాలు వుండేది ఒకప్పుడు. జీవనోపాధి కోసం కొన్నాళ్లు ఆమె నాశ్రయించుకొని, ఏదైనా ఉద్యోగమో, లేదా మళ్లీ సినిమా ప్రయత్నమో చేద్దామని కొండంత ఆశతో ఆమె అడ్రసు వెతుక్కుంటూ వెళ్లిన నాకు, ఆమెకు మరో హోటల్‌కి ట్రాన్స్‌ఫర్ అయిందని విని హతాశురాలినయ్యాను.

ఉప్పు

చుట్టం వస్తే
కూర... పప్పు...
పట్టప్పుడు
చారు... ఉప్పు...
ఆ అప్పు తెచ్చిన ముప్పు —
తప్పేటందుకే ఈ ఉప్పు.

—ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

దిక్కుతోచని అయోమయ స్థితిలో, చేతిలో సూట్‌కేసును బరువుగా ఈడ్చుకుంటూ నిర్జీవంగా, యాంత్రికంగా, బెదురుచూపులతో, ఆకలి అడుగులు వేస్తున్న నన్ను గమనించిన కొందరు రౌడీలు నా అసహాయతను గ్రహించి నా వెంటబడటంతో భయపడి, కర్తవ్యం తోచక, గత్యంతరం లేక ఈ సందులో చేరి అందులో మొదటి యింటి తలుపు తట్టాను. ఆ యిల్లు మీదికావటం నా అదృష్టమో, దురదృష్టమో తెలియదు. సరే! ఆ తర్వాత జరిగినది నీకు తెలిసిందే! ఆ రోజున తలుపులు తెరచిన నిన్నూ, సిగరెట్టు పీకలతో నిండిన మీ గదినీ చూసేక, ఇక్కడా స్త్రీల జాడలేదని ఎంతో కంగారు పడ్డాను. అయితే అది క్షణికమే! భగవంతుడే నీ రూపంలో నా ఎదుట సాక్షాత్కరించాడు. సమయానికి నీ స్నేహితుడు కిశోర్‌గారు లేకపోవటంతో ఆయన మరదలుగా భ్రమించి నాకాశ్రయమిచ్చావు. ఆయన కూడ నీ చెల్లెల్ననే భావనతో నన్ను గౌరవించేరు. రెండు నిండు మనసుల మధ్య ఈ వంచకి గౌరవంగా నెలరోజుల కాలాన్ని దొర్లించటానికి కారణం ఆ ఇద్దరమ్మాయిల పేర్లు ఒకటి కావటమే! లేదా ... మరోలా చెప్పాలంటే నా అదృష్టం బావుండటమేనేమో!

ఈ రోజుదయం కాఫీ సేస్తూ మీ సంభాషణ విన్నాను. నా నిష్క్రమణకు చివరిరోజిదేనని గ్రహించాను. అంతే! కప్పునక్కడే పెట్టేసి, నా సూట్‌కేసుతో సహా ప్రక్కగదిలోంచి బయటపడ్డాను మీకు కొంచెం దూరంలోనేవున్న రామాలయం ఆవరణలో కూర్చుని ఈ లేఖ వ్రాస్తున్నానిప్పుడు. ఇన్నాళ్లూ నటిని కాలేకపోయినా జీవితంలో...ఎంతో అమాయకత నటించి నిన్ను వంచించిన నా గూర్చి నువ్వేమనుకుంటున్నావన్నయ్యా? (ఏమనుకున్నా నీ మనసులోనే అనుకుంటావని నాకు తెలుసు!)

నేనెక్కడికిపోతానని అనుకుంటున్నావు కదూ? ఏం చెప్పను? గూడు వదిలిన పక్షిది గమ్యంలేని యాత్ర. గమ్యాన్ని నాకు నేనుగా మూసుకున్న వాటలో ఎటో ... ఎక్కడికో...సాగిపోతాను. మళ్లీ ఎక్కడో ... ఎప్పుడో ... ఏ జన్మలోనో ... మీ ఋణం తీర్చుకుంటాను. నీ మిత్రులు కిశోర్‌గారికి కూడ నా కడసారి ప్రణతులందజేస్తావు కదూ!

ఇన్నాళ్లూ నీతో మమతలు పంచుకుని, బాంధవ్యం పెంచుకుని, నేడు కన్నీటితో సెలవు పుచ్చుకుంటున్న నీ సహోదరి కాని సోదరి ...

(అన్నట్టు నా అసలు పేరు...) మాలిని! ★




### జె. బి ఆర్ – మొలగవల్లి

ఆడవాళ్లే దేవాలయంలో అర్చకులైతే?

★ దేవుడిని చూడడం మానేస్తారు భక్తులు!

### అనిత – అదోని

నిర్మాతలు రచయిత్రులచేత పాటలు రాయించరెందుకు?

★ కావలసినంత వూపు వుండదనేమో! తెలియదు.

హైందవ సంస్కృతికి విభిన్నంగా వెలువడుతున్న వస్త్రధారణపై రచయిత్రిగా మీ అభిప్రాయం?

★ సర్వం సంస్కృతికి అనునాయంగా సాగిపోతూందనుకుంటూ వుంటే – యీ వస్త్రధారణని పట్టించుకోవాలి. పిలకలెట్టుకు తెలుగు సాహిత్యం బోధించరుగాని జీన్స్ వేసుకుని చదువుకుంటే తప్పా?!

### ప్రభాకర్ – జనగావు

తమ భర్తలు ఎలా చూస్తున్నా కొందరు స్త్రీలు గొప్పగానే చెప్పుకుంటారు. దానివల్ల వారికి లాభం?

★ వారికి కాదు. వారి భర్తలకే లాభం – పరువుపోదు.

### జి వి. – హైదరాబాదు

ఆదర్శం ఎవరికి వుండాలి?

★ చిన్నతనం ఏ ఆదర్శం లేకుండా పరుగులు తీయవచ్చుగాని యువతకి ఆదర్శం వుండాలి. అది తెలుగు సినిమాల్లోలాగా ప్రేమే కానక్కరలేదుకూడా!

### జె. ఎస్. – ఒంగోలు

నేటి నవలా రచన చాలా దిగజారిపోతూంది...

★ అంతా అంటారేగాని మంచి నవల యిలా వుండాలని ఏ మొనగాడూ రాసి చూపించరేం? తమ తమ రాజకీయ దృక్పథాలకూ, తమ తమ వ్యక్తిగత అభిరుచులకూ అద్దంపట్టే రచనలు సాగిస్తూ గురుపీఠం అలంకరించాలనే ఉబలాటమే తప్ప – అవి సాధిస్తున్న ప్రయోజనాలని లంచనా వెయ్యరేం? నన్నడిగితే–వ్యభిచార కథలూ, తాగుబోతు కథలూ, దెయ్యాల కథలకంటే యీ సాదా సీదా సాంసారిక నవలలే నయం అంటాను.

### వి. ఎ. ఆర్. – సికింద్రాబాదు

పిల్లలు కొట్టేనకొద్దీ మొండికేస్తారెందుకు?

★ ఎందుకేమిటి మొదటి దెబ్బని మించినవేం కావుకద తరవాత దెబ్బలు!

పిల్లల్ని తెగ తిట్టిపోసే తల్లులకి మీ సలహా?

★ నోటితో వాగేకంటే తుంటిమీద ఒక్కటి తగల్బడం మంచిది. అల్లరి చేసినప్పుడు అదలించడం, ముద్దొచ్చినప్పుడు ముద్దాడడం -- తల్లికి లక్షణం. కొందరు తల్లులు నిజంగనే ఆలోచనారహితంగా పిల్లలని కారుతిట్లు తిడతారు – అది వారిలో పేరుకుపోతున్న అసహనానికి, అలసటకి చిహ్నం. అంతేకాదు – అత్తమీద కోపం దుత్తమీద తీర్చుకున్నట్టు -- అందరిమీద కోపం పిల్లలమీద చూపెడతారు. పిల్లలేకదా అనుకుంటాంగాని మన ప్రవర్తన వాళ్లకి గురువు అన్నది మరిచిపోతాం!!

### బి. జె – ఉరవకొండ

మనలో గాఢంగా జీర్ణించుకుపోయిన సెంటిమెంట్సుమీద మీ అభిప్రాయం ఏమిటి?

★ సెంటిమెంట్సు లేకపోతే మనం మనుషులం ఎలా అవుతాం?!

### ఎస్. వి. బి. కొమరగిరిపట్నం

సూక్తులు సేకరించడం నాకు హాబీ...

★ గుడ్ హాబీ.

### ఎల్ వి. – వంగవల్లి

స్త్రీని సుమంగళిగా వుండమని దీవిస్తారు. మరి పురుషుణ్ణి?

★ చిరంజీవిగా వుండమంటారు.

### కె. జి. ఎస్. కె – కుప్పం

ధరల పెరుగుదలతో వరకట్నం రేటు కూడా నానాటికీ పెరుగుతూ వుంది. దీనికి అంతం ఎప్పుడు?

★ ధరల పెరుగుదలకీ వరకట్నం పెరుగుదలకీ సంబంధం లేదు. వరకట్నం పెరుగుదలకీ సిగ్గులేనితనం పెరుగుదలకీ సంబంధం వుంది. ఇక్కడ నాకు తెలిసిన ఓ మామ వున్నారు. కొడుకు పుట్టినప్పటి పురిటి ఖర్చు దగ్గరనుంచి బైండు పుస్తకంలో రాసి వుంచాడు. పెళ్లికి ఈ ఖర్చులన్నీ రాబట్టాలిట. అందుకే పాపం చిన్నమామ కిప్పటికి రెండొందల్లో మూడొందల్లో సంబంధాలూ చూశాడు, ముప్ఫయి ఐదు దాకా పెట్టాడు!

### వెంకట్ – ఉరవకొండ

ప్రపంచ సాహిత్యంలో మీ అభిమాన పాత్రలు ఎవరు?

★ ఎవరని చెప్పను చేఖ్ నుండి మాడ్ దాకా సర్వం భక్షిస్తాను!






# అరాచకమా వర్ధిల్లు!

వి. మోహనకుమార




దిల్‌సుక్ నగర్ విశాలమైన తారురోడ్డు మీద శరవేగంతో పోతోంది ఆటో. దాంట్లోకూర్చున్న శంభు ఆలోచనలు అంతకన్నా వేగంగా పరుగెడుతున్నాయి.

ఇంటర్వ్యూ అయి సంతృప్తితో బయటకి వచ్చినట్టు ... ఎపాయింట్‌మెంట్ ఆర్డరు వచ్చినట్టు ... అందరూ తనని అభినందిస్తూంటే విజయగర్వంతో ఛాతీ విరుచుకుని అందరి దెస చూస్తున్నట్టు ఊహించుకుని కలలు కంటున్నాడు.

మలక్‌పేట రైల్వేబ్రిడ్జ్ దాపుల్లోకి వచ్చిన ఆటో ఒక్కసారిగా కీచుమని కుదుపుతో ఆగింది.

''రషీద్ భాయీ! ఆటో ముందుకి తీసుకుపోవద్దు. పెద్ద గొడవవుతోంది'' అన్నాడు, ఆటోని ఆపమని సైగచేసి ఆపించిన మరో ఆటో డ్రైవర్.

''ఏమైంది'' అడిగాడు రషీద్.

''బస్‌కి ఆటోకి గొడవయింది. ఇసామియా బజార్, చాదర్‌ఘాట్ ఏరియా గొడవగా ఉంది. ఆటో బంద్. అంతకుమించి తెలియదు'' అన్నాడతను.

అలా అని ముందుకు దూసుకుపోయాడు.

శంభు ఈ లోకంలోకి వచ్చాడు.

''ఏమైంది ?''

''తెలియద్ సాబ్! ఆటో ముందుకిపోదు.''

శంభుకి గుండె ఆగిపోయినట్టయింది. ''దయచేసి సాధ్యమైనంత దూరం తీసుకెళ్ళు. ఆలస్యం అయితే బస్సు వెళ్ళిపోతుంది. నేను ఇంటర్వ్యూకి వెళ్ళాలి'' శంభు ఆటో డ్రైవర్ని బతిమాలాడు దీనంగా.

''అది సరే సాబ్! మీ ఇంటర్వ్యూకని ఇరవైవేల ఆటో పాడుచేసుకోమంటరా ? దిగండి''

నటసామ్రాట్
డా॥ **అక్కినేని**
నటించిన

**దాసరి నారాయణరావు**

# రాగదీపం

దాసరి నారాయణరావు
సమర్పించు




వీరరాణి ఎంటర్‌ప్రైజస్

సంగీతం: చక్రవర్తి ఫోటోగ్రఫీ: సెల్వరాజ్

నిర్మాత: **కొడాలి బోసుబాబు** నైజాం: శ్రీ తారకరామ సీడెడ్: స్వర్ణయుగ మూవీస్



# సినిమా

## మధుర గీతం

ఓ విద్యార్థి, విద్యార్థిని మధ్యగల నిర్మలమైన స్నేహానికి మారుపేరు పెట్టి, లేనిపోని అపోహలు సృష్టిస్తారు కొందరు గిట్టనివాళ్ళు. వాళ్ళకు కనువిప్పు కలిగించి, మార్గదర్శకుడవుతాడు ఓ ఉపాధ్యాయుడు. విశిష్టమైన ఈ కథలో నాయకా నాయికలుగా సురేష్, శాంతికృష్ణ; ఉపాధ్యాయుడుగా ప్రతాప్‌పోతన్ అద్భుతంగా నటించారు. ఇది తమిళంలో విజయవంతమైన "పన్నీర్ పుష్పంగళ్" అనే చిత్రం. దాని తెనుగు సీత రోహిణీ ఆర్ట్ మూవీస్‌వారి "మధుర గీతం" చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది. మాటలు, పాటలు రాజశ్రీ రాశారు. ఇళయరాజా, సారథి, సంగీతమిచ్చారు. ఎం. సి. శేఖర్ ఛాయాగ్రాహకుడు. భారతీ - వాసు దర్శకత్వం నెరిపారు. బిరదా వెంకటేశ్వరరావు నిర్వహణలో అత్యం సోమేశ్వరరావు నిర్మాత.



'ధర్మవడ్డీ'లో ప్రభ

## ఇరుగు - పొరుగు

★ ముస్లిమ్ అయిన ప్రముఖ మలయాళం హీరో ప్రేమ్‌నజీర్ తన స్వగ్రామంలో ఒక శివాలయానికి ఏనుగును బహూకరించాడు

★ మలేసియాలోని కొన్ని థియేటర్లలో మధ్యన 'ఇంటర్వెల్' లేకుండా చలన చిత్రాలు ప్రదర్శింపబడుతూంటాయి.

★ 'గాడ్‌ఫాదర్' చిత్రం ప్రేరణతో తమిళంలో "గరుడా సౌఖ్యమా" అనే చిత్రం కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో తయారౌతోంది. ఇందులో హీరో శివాజీగణేశన్ గర్జనలు వినిపించవు. చిత్రమంతటా ఆయన హీన స్వరంలో మాట్లాడ్డం ఓ విశేషం.

★ ఎన్. టి. ఆర్‌కు "శ్రీనాథ కవి సార్వభౌముడు" చిత్రాన్ని నిర్మించే తలంపు ఉంది.

★ "లావారిస్"లో అమితాబ్ బచ్చన్ పాడిన "మేరే అంగ్నేమేఁ" గీతాన్ని పాకిస్తాన్‌లోని కొజ్జావాళ్ళు తమ స్వంత గీతంగా స్వీకరించారు. ఆ నటుడ్ని తమలో శాశ్వత సభ్యుడిగా చేర్చుకోడానికి కుతూహలాన్ని వ్యక్తపరచారట కూడా.

★ తాంత్రిక ఛాయాగ్రాహకుడు రవికాంత్ నగాయిచ్ 'ఎస్' తొలి అక్షరంగా గల నాలుగు చిత్రాలను స్వీయ దర్శకత్వంలో రూపొందించబోతున్నారు. అవి: "సాక్షి, సజన, స్వాగత్, సుగంధ్."

★ "సాత్ శ్రీ కే సత్తా" హిందీ చిత్రంలో ఏడుగురు హీరోల పాత్రలకు ఏడు వారాల పేర్లు. అమితాబ్ బచ్చన్ (రవి), మదీర్ (సోమ్), శక్తికపూర్ (మంగళ్), షైంటాల్ (బుధ), కన్వల్జీత్‌సింగ్ (గురు), విమల్ సాహూ (శుక్ర), సచిన్ (శని).

★ సత్యజిత్‌రే మీద 60 నిమిషాల డాకుమెంటరీని తయారుచేయడానికి ఫిలిమ్స్ డివిజన్ నిశ్చయించి, దర్శకత్వ బాధ్యతను శ్యామ్ బెనగల్‌కు అప్పగించింది.

★ ఆస్ట్రేలియాలో వినోదపు పన్ను రూపేణా వచ్చే సొమ్ము అక్కడి చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి కోసమే వినియోగించబడుతుంది. ఫ్రాన్స్‌లో కూడా అంతే.

★ కె. ఎ. అబ్బాస్ రూపొందించే "మిస్టర్ ఎక్స్" సైన్స్‌ఫిక్షన్ చిత్రానికి నేపథ్యంలో అమ్జాద్‌ఖాన్ పరిచయ వాక్యాలు విశేషాకర్షణ.

★ "రాజ్" చిత్రంలో హీరో సంజీవ్‌కుమార్ స్థానే రాజ్‌బబ్బర్, సంగీత దర్శకులు లక్ష్మీకాంత్ ప్యారేలాల్ స్థానే ఉషాఖన్నా నియమితులయ్యారు.

★ నటి సిమి కథ సమకూర్చి దర్శకత్వం వహించే "అర్ధాంగిని" చిత్రంలో ఆమెతోపాటు స్మితాపాటిల్, వినోద్‌ఖన్నా పాత్రధారులు.

★ 1980'లో తయారైన పట్టిక ప్రకారం మన దేశంలో మొత్తం 10,392 చలనచిత్ర ప్రదర్శనశాలలున్నాయి. వీటిలో 4024 సంచార చిత్ర ప్రదర్శనశాలలు. అమెరికాలో 1,44,200 చిత్రమందిరాలు, సోవియట్ రష్యాలో 1,47,200 చిత్రమందిరాలున్నాయి.



'విప్లవ శంఖం'లో నర్రా వెంకటేశ్వరరావు, త్రివేణి

## విజయారెడ్డి దర్శకత్వంలో శ్రీ లలితా మూవీస్ చిత్రం

"జనవరి 27న సాంగ్స్ రికార్డ్ చేస్తాం. ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ నెలల్లో 1 10 తారీఖుల మధ్య షూటింగ్ ఉంటుంది," అన్నారు జి. జగదీశ్ చంద్రప్రసాద్. ఈయన నిర్మించే చిత్రంలో చిరంజీవి, శరత్‌బాబు, రాధిక, గిరిబాబు ఆదిగాగల వారుంటారు. గణేశ్‌పాత్రో సంభాషణాకర్త. సత్యం సంగీత దర్శకుడు. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు.

సీరియల్

# జీవితవనంలో కొత్తగాలి

## కుందుర్తి ఇందిరాదేవి

**22**

"నా కిరణ్,

నాకు ఏం చెయ్యాలో తోచటం లేదు. అసలు నువ్వెందుకు కలిశావు ? నన్ను బలవంతంగా ఈ ప్రేమలోకి లాగావు? నేనానాడే చెప్పలేదా కిరణ్. ఈ బాధ్యతలు, ఈ బంధాలు తెంచుకుంటే తెగేవికావు. వాటంతట అవే తెగిపోవాలి అని. నువ్వు విన్నావా. శశి ఉద్యోగం చెయ్యదట. వాళ్ళ అత్తగారి ఆజ్ఞ అది అక్షరాలా శిరసావహిస్తోంది కిరణ్. ఆఖరికి అమ్మకూడా శశినే సమర్థిస్తోంది. నాకేం చెయ్యాలో తోచటంలేదు. నేను బొంబాయి ట్రాన్స్‌ఫర్ చేయించుకుందామనుకున్నా వీలుకాలేదు. మాకు అక్కడ అసలు బ్రాంచిలేదు. నువ్వు ఇక్కడికి రాలేవు. ఎలా కిరణ్. ఈ సమస్యకి పరిష్కారం నాకు తోచటంలేదు.

ఈ ఇంటి కోసం నిన్ను ఒదులుకుందుకు నేను సిద్ధంగాలేను. నేనంత త్యాగమూర్తిని కాదు. నువ్వులేంది నేను బ్రతకలేను. నువ్వే ఏదో ఒక పరిష్కారం చెప్పు. ప్లీజ్ ! కిరణ్ ! నకు పిచ్చెత్తి నట్టుగా ఉంది. నాకసలు బుర్ర పని చేయటంలేదు. నేనేం చెయ్యాలో నువ్వు చెప్పు. నువ్వు ఆలస్యం చేస్తే నేను ఊరుకోను. నీ లెటర్‌కై వేయి కళ్ళతో అనుక్షణం ఎదురుచూసే —

నీ
సంధ్య."

నేను కిరణ్‌కి ఆ లెటర్ పోస్ట్ చేశాను. ఇంట్లో వాళ్ళతో మాట్లాడలంటేనే నాకు మనస్కరించటంలా. నన్ను సేదదీర్చే నా ప్రాణస్నేహితురాలు డార్జిలింగ్ వెళ్ళిపోయింది. నా సమస్యల్ని చిటికెలో పరిష్కరించే నా కిరణ్ బొంబాయిలో ఉన్నాడు. నేను పడే ఈ ఆవేదన వర్ణనాతీతం.

కిరణ్ నుండి అసలు లెటర్ రాలేదు. నాకు దిగులుగా ఉంది. మధ్యాహ్నం విమల వచ్చింది.

"లెటర్స్ ఏమైనా వచ్చాయా విమలా" అన్నాను.

"లెటర్సా ! ఓ ఇంత కట్ట తెచ్చాడు. అవును గానీ ఏమిటి అలా ఉన్నావు ?"

"అది సరే ! నాకేమైనా లెటర్ ఉందా" అన్నాను ఆత్రంగా లేస్తూ.

(గత సంచిక తరువాయి)

"బాగుంది ఉత్తరాలు వచ్చాయి అన్నావు కానీ, నీకు వచ్చాయి అని చెప్పానా" విమల చిరుకోపంగా అంది.

నేను నీరసంగా కుర్చీలో కూలబడ్డాను.

"ఏమిటోయ్ సంధ్యా ! అలా అయిపోతున్నావు. నీ ప్రియుడి గురించేనా ఆ దిగులు" విమల హాస్యం చేసింది.

నా పెదవులపై చిరునవ్వు కదిలింది. విమల నవ్వుతూ వెళ్ళిపోతూ "లెటర్ వచ్చింది" అంటోంది.

నేను చివ్వున తలెత్తి "ఏయ్ విమలా నన్ను తర్వాత ఏడిపిద్దువుగానీ ! ఏదీ నా లెటర్" అన్నాను కోపంగా.

విమల తెల్లబోయినదానిలా చూసి "ఓ నా తల్లీ ! నీకు నేయి నమస్కారాలు. వస్తే నేను దాచుకుంటానా" అంది.

"మరిప్పుడు లెటర్ అన్నావు" అనుమానంగా అన్నాను.

విమల పకపకా నవ్వింది "ఓ! అదా! కర్నూల్ నుండి హనుమంతరావుగారికి వాళ్ళక్క పండక్కి తీసుకువెళ్ళ ఊహారన్నా మంచి చీర పెట్టురా హనుమంతూ అని వ్రాసిందట. ఇకపోతే ప్రసాద్‌గారి భార్య పుట్టింటినుంచి ఓ ప్రేమలేఖ రాసిందట."

నేను అసహనంగా చూశాను. విమల నవ్వుతూనే అంది—

"మరి మీకేం రాలేదా అని వీళ్ళు అడుగుతుంటే-నాకు వచ్చింది. ఓ సినిమానటుడు ఫోటో కూడా పంపించాడు. లెటర్ కూడా వచ్చింది అన్నాను" అంది నవ్వి.

నేను అప్పటికే చిర్రెత్తుకొచ్చి ఫైలు లాక్కున్నాను మొహానికి అడ్డంగా. మధ్యాహ్నం నేను టేబుల్‌మీద తల ఆనించుకుని కూర్చుని ఉన్నాను. నా చేతిలో పెన్ను ఫైల్లో కదలలేనట్టుగా అలాగే ఉంది. అంతులేని నిస్సహాయతా, దిగులు నన్ను ఇంతగా క్రుంగదీస్తాయని నాకు ఇప్పటివరకూ తెలీదు. ఇంతలో హఠాత్తుగా నా చెవుల్లో 'టక్, టక్, టక్' అంటూ లయబద్ధంగా బూట్ల శబ్దం వినిపించింది. నేను అది సుపరిచితమైన శబ్దం అన్న అనుమానంతో ఇంకా శ్రద్ధగా వింటున్నాను.

ఇంతలో "సంధ్యా ! నీ హీరో వచ్చాడే" అన్న విమల పిలుపు కంచు కంఠంలా వినిపించింది.

నేను చివ్వున తలెత్తి చూశాను. కిరణ్ నిశ్శబ్దంగా నిలబడి ఉన్నాడు. తెల్లటి పాంటు, గళ్ళ షర్టు. నిశ్చలంగా నిలబడి ఉన్నాడు. నేను ఫైలు ఎప్పుడు మూశానో, ఎప్పుడు కిరణ్ దగ్గరికి వెళ్ళానో నాకే తెలీదు.

"సంధ్యా" అతను నా భుజంమీద చెయ్యి వేశాడు.

ఆ పిలుపు నాలో జీవం పోస్తున్నట్టుగా ఉంది. అతన్ని చూసి కొన్ని యుగాలయినంత భ్రాంతిగా ఉంది నాకు. కిరణ్ నా ఉత్తరానికి జవాబుగా తానే బయలుదేరి వస్తాడని నేనెన్నడూ ఊహించలేదు. అతను చప్పున ఫైల్సు సర్దేస్తూ,

"నువ్వెళ్ళి చప్పున మీ ఆఫీసర్ పర్మిషన్ తీసుకురా" అన్నాడు. నేను చప్పున పరిగెత్తి

**జరిగిన కథ - 11 :** పోతూ పోతూ ఆ కుటుంబ భారంతోపాటు చేసిన అప్పు కూడ పెద్దకూతురైన సంధ్యపై వేసి కన్నుమూస్తాడు ఆమె తండ్రి. ఓ చిన్న ఉద్యోగం చేస్తూ తల్లితో పాటుగా తమ్ముణ్ణి, ముగ్గురు చెల్లెళ్ళను పోషిస్తూ వాళ్లకి చదువు సంధ్యలు చెప్పిస్తుంటుంది. ఎప్పుడైనా డబ్బు అవసరమైతే తన స్నేహితురాలు ప్రమీల దగ్గర తెచ్చుకుని మళ్లీ ఇచ్చేస్తుంటుంది. ప్రమీల అన్న కిరణ్‌తో సంధ్య స్నేహం చిగుళ్ళు తొడుగుతూంటుంది. ప్రమీల పుట్టినరోజు పార్టీకి సంధ్యా, కిరణ్‌లు వెళతారు, ఆమె ఆహ్వానించగా పార్టీ పూర్తయిన తర్వాత తన స్కూటర్‌పై సంధ్యను వాళ్ళింటి దగ్గర దించి వెళతాడు కిరణ్. సంధ్యకు దగ్గర కావాలనే ఉద్దేశ్యంతో కిరణ్ చేసే పనులు ఆమెకు ఆశ్చర్యాన్ని కల్గిస్తాయ్! శశి ఎవరో అబ్బాయితో తిరుగుతుండగా చూసిన ప్రమీల చెప్తేగాని తన కర్తవ్యం ఏమిటో గుర్తుకు రాలేదు సంధ్యకి. శశి ఎవరితోనో తిరగడం తన కళ్ళారా చూసిన సంధ్య నిశ్చేష్టురాలవుతుంది. ఒకరోజు "సంధ్యా ఐ లైక్ యూ! ఐ లౌ యూ" అని కిరణ్ చెప్పగా ఆమె ఉబ్బితబ్బిబ్బవుతుంది. శశి చదువు పూర్తయి ఉద్యోగంలో చేరగానే ఆమెకు ఆ ఇంటి బాధ్యత అప్పగించి సంధ్యా, కిరణ్‌లు పెళ్లి చేసుకొని తామూ సహాయపడాలని నిశ్చయించుకొంటారు. తను అన్నమాటలకు శశి తన ప్రియుడు ప్రకాష్‌తో నిక్కచ్చిగా మాట్లాడి వెళ్లిపోవడం చూసిన సంధ్య ఆశ్చర్యపోతుంది. ఆమె అభిమానానికి. సంధ్యకు పుట్టినరోజు కానుకగా 'జీవితవనం' అనే ఛాయాచిత్రాన్ని గీసి ఇస్తాడు కిరణ్. ఉద్యోగంలో చేరి ఆ ఇంటికి ఆధారం అవుతుందనుకొన్న శశి, ప్రకాష్‌ని పెళ్లి చేసుకొని వెళ్లిపోవడంతో, దిక్కు తోచని పక్షిలా విలవిలలాడిపోతుంది సంధ్య. శశికి ఉద్యోగం వస్తే, తన అత్తగారికి ఇష్టం లేకపోవడంతో చేయనని ఖచ్చితంగా చెప్పేసి వెళ్లిపోతుంది. కిరణ్‌కి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అవడంతో మరీ కృంగిపోతుంది సంధ్య.

పర్మిషన్ అడిగివచ్చాను. ఆఫీసులో అందరూ విస్మయంగా అతన్ని చూస్తున్నారు. విమల అతనితో ఏదో అంటోంది. అతను నవ్వుతూ విమలతో వెళ్తాస్తానని చెప్పి బయటకొచ్చాడు.

నా భుజాలచుట్టూ కిరణ్ చెయ్యి నాకు కవచంలా రక్షణ ఇస్తున్నట్టుగా ఉంది. భగవాన్! ఈ అదృష్టాన్ని నేను వదులుకోలేను. నావల్లకాదు. అనుకున్నాను. నా కళ్ళల్లో చివ్వున నీళ్ళు రాబోయినాయి. అతను "ఇది రోడ్డు సంధ్యా" అని ఉరిమి చూడటంతో చప్పున ఆపుకున్నాను.

కిరణ్‌తో స్కూటర్ మీద ఝామ్‌గా తిరగటం అలవాటు. ఈ రోజు ఇలా, ఈ క్షణంలో నడుస్తుంటే నా కాళ్ళు తడబడుతున్నాయి. ఇద్దరం వెళ్ళి హోటల్లో కూర్చున్నాము.

అతను ఏవో ఆర్డరిచ్చాడు.

"ఎప్పుడు వచ్చావు?" ఎలాగో అన్నాను.

"రాగానే నీ దగ్గరికే పరిగెత్తుకొచ్చాను" అన్నాడతను.

"నీ లెటర్ అందేనాటికి నేను పెళ్ళికి వెళ్ళాను సంధ్యా. రాగానే నీ లెటర్ కనిపించింది. వెంటనే బయలుదేరి వచ్చేశాను" అన్నాడు.

నా కళ్ళు ఆనందంతో జలజలలాడాయి. నాకోసం నా కిరణ్ ఎంత శ్రమైనా పడతాడు. గర్వంగా అనిపించింది ఆ క్షణంలో.

అతన్ని చూడగానే పొర్లుకువస్తున్న దుఃఖాన్ని ఆపటానికి నేను చేస్తున్న ప్రయత్నాలు వ్యర్థం



అయినాయి. హఠాత్తుగా వెక్కి వెక్కి ఏడుస్తున్నాను.

అతను నా తలమీద చెయ్యివేసి "సంధ్యా! నువ్వు ప్రస్తుతం ఇలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలతో వేగిపోతుంటావనే నేను బయలుదేరి వచ్చాను. ఏమిటీ పిచ్చి?" లాలనగా అన్నాడు.

"కిరణ్" నేను బావురుమన్నాను.

"నా సంధ్యా! ప్రతి చిన్న విషయాన్ని నువ్వింత సీరియస్‌గా తీసుకుంటావేమిటి? ఊ! చూడు నేను వచ్చేశాగా. ఒక్క నిముషం ఏడుపు ఆపేసెయ్యి. బేరర్ వస్తున్నాడు" అన్నాడు.

నేను కళ్ళు తుడుచుకున్నాను. బేరర్ తెచ్చినవి టేబిల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు. అతను నావైపు పరీక్షగా చూసి —

"నువ్వు తిండి తిని ఎన్ని రోజులయింది" అన్నాడు.

నేను చప్పున పట్టుబడ్డదానిలా చూశాను

"భోజనం తెప్పించనా?" అన్నాడు. నేను "వద్దు" అన్నాను.

నేను వద్దు మొత్తో అంటున్నా "చూడు నా చేత్తో తినిపిస్తే ఎంత రుచిగా ఉంటుందో" అంటూ నాకు బలవంతాన తినిపించాడు. కడుపు నిండటంతో హుషారు వచ్చింది.

ఇద్దరం ఆటో ఎక్కి పబ్లిక్ గార్డెన్స్ చేరుకున్నాము. ఎప్పుడూ కూర్చునే చోటు వెతుక్కుని మౌనంగా పది నిమిషాలు కూర్చుండిపోయాము.

"కిరణ్"

"ఊ" అతను తలెత్తి చూశాడు.

నేను చప్పున అతని పక్కకి జరిగి అతని ఒళ్ళో తల పెట్టుకుని అలాగే పడుకున్నాను. అతను నా జుట్టుని సరిచేస్తూ ఉండిపోయాడు.

"సంధ్యా"

"ఊఁ"

కాసేపు మళ్ళీ మాట్లాడుకోలేదు. చివరికి తనే అన్నాడు —

"సంధ్యా! ఈ ప్రపంచంలో స్వార్థం పెరిగిపోతోంది సంధ్యా" అన్నాడు.

"అవును" అన్నాను ఏకీభవిస్తూ.

"ఎవరిలోకూడా సేవాభావం ఉండటం లేదు..." అతనింకా ఏదో అనబోయాడు. నేను ఛర్రుమన్నాను.

"ఇదుగో కిరణ్ చెప్తున్నాను. నేను మీరనుకునే త్యాగమయిని కాను. నాకు అందరిలా బ్రతకాలని ఉంది."

అతను నా ముక్కుపట్టి ఊపుతూ "నా పిచ్చి సంధ్యా! నీ కెంతసేపు ఆవేశమేగానీ ఆలోచన లేదు. మీ చెల్లి ఉద్యోగం చెయ్యకపోతేనేం? మనం ఈ ఇంటికి అండగా నిలబడదాం. మనంకూడా పెళ్ళి చేసుకుందాం సంధ్యా. అమ్మ ఆరోగ్యం బావుండటం లేదు. వదినకి అమ్మకి అసలు కుదరదు. అమ్మ నా పెళ్ళి చేసి నా నీడలో కాస్త సుఖంగా ఉండాలని కోరుకుంటోంది. మా నాన్నగారే ఉంటే నాకీ తిప్పలన్నీ లేకపోను" అన్నాడు.

"కిరణ్" నేను సంభ్రమంగా అన్నాను.

నేను మళ్ళీ ముఖం మాడ్చుకుంటూ "మనం పెళ్ళి చేసుకుంటే నేనిక్కడ నువ్వక్కడా. ఏం బాగుంటుంది" అన్నాను.

"పోనీ బొంబాయిలోనే ఏదో ఒక ఉద్యోగం చూస్తానులే నీకు" అన్నాడు నవ్వుతూ.

"నిజం" నమ్మలేనట్టుగా అన్నాను.

"అంత ఖచ్చితంగా చెప్పలేను. ట్రై చేస్తాను.

ఒకవేళ రాకపోతే ఈ ఉద్యోగమే చేస్తూ రెండేళ్ళు కళ్ళు మూసుకుంటే, ఫల్గుణ ఎక్కివస్తాడు. చదువు అయిపోతుంది'' అన్నాడు.

''రెండేళ్ళే'' అన్నాను గుండెమీద చెయ్యి వేసుకుంటూ.

''సారీ ! నువ్వు ఒక నెల్లో బొంబాయి రా. ఇంకో నెల్లో నేనే హైదరాబాద్ వస్తాను'' అన్నాడు.

''అఛ్ఛా'' నేను పకపకా నవ్వాను

''ఏదీ మళ్ళీ నవ్వు. నీ నవ్వు విని చాలా రోజులయింది'' కొంటెగా అన్నాడు.

''ఛీ ! పో'' అన్నాను కోపం తెచ్చుకుంటూ

కిరణ్ చాలాసేపు బొంబాయి కబుర్లు చెబుతూ నన్ను తెగనవ్వించాడు. సాయంత్రం పిక్చర్ ప్రోగ్రామ్ వేశాడు. ''ఏం సినిమాకి వెడదాం చెప్పు'' అన్నాడు ఛాయిస్ నాకే వదిలేశాడు.

''ఏదో ఒకటి'' అన్నాను.

''ప్లీజ్ ! కొంచెం సిగరెట్లు తెచ్చుకుంటాను'' అంటే నేనుకూడా వెళ్ళాను. అతను సిగరెట్టు తాగుతూవుంటే నేను ముక్కుమూసుకుని దూరంగా వెళ్ళానని కిరణ్ ఫక్కున నవ్వాడు. నేను అక్కడున్న పాన్ షాప్‌లో పేపర్ తీసి చూసి నగరంలో ఏం సినిమాలు ఆడుతున్నాయోనని చూశాను. చప్పున తలెత్తి,

''కిరణ్ ఆరాధన ! ఆరాధనకి వెళదాం'' అన్నాను.

అతను అంగీకరించాడు. ఇద్దరం ఆటోలో సినిమాహాలుకి వెళ్ళాము. అందులో చక్కని పాటలు, హాస్యం ఉన్నాయి. నన్ను కదిలించివేసిన పాట ''నీ చెలిమీ... నేడె కోరితిని... ఈ క్షణమే ఆశ విడితిని.''

నేను హఠాత్తుగా ఏడ్చేశాను. కిరణ్ చప్పున నా తల పట్టుకుని గుండెల కానించుకుని ''యూ సిల్లీ గర్ల్. ఏమిటా ఏడుపు. ఛ ! ఛ ! అది కేవలం మూడు గంటల సినిమానే. ఊరుకో ! ఊరుకో'' అని లాలించాడు. అందులో కఠినమైన ఆజ్ఞకూడా ఉంది.

''ఊఁ ..'' నేను గుటుక్కున ఏడుపు మింగ సాగాను.

''నా పిచ్చి సంధ్యా ! ఆ హీరోయిన్ కన్నా, నువ్వే బాగా ఏడుస్తున్నావ్'' అని హాస్యం చేశాడు నా బుగ్గ గిల్లి.

కానీ ఎందుకో ఆ పాట మాత్రం నా గుండెల్లో

# జీవితవనంలో కొత్తగాలి

చెరగని ముద్రలా, ఎందుకో భయంగా, నా గుండెల్ని ఇనుప పిడికిలితో నొక్కుతున్నట్టుగా నిలిచిపోయింది.

ఇద్దరం హోటల్లో భోజనం చేశాము. ఆటోలో ఇంటికి బయలుదేరాం. నేను అతని ఒళ్ళో తల పెట్టుకుని నిశ్శబ్దంగా బయటకి చూస్తున్నాను. ఆ రాత్రి, ఆ చల్లటిగాలి, తెల్లటి వెన్నెల, వింతగా వినిపిస్తున్న ఆటో శబ్దం నా గుండెల్లో శాశ్వతంగా నిలిచిపోయాయి. ఈ రాత్రిని మాత్రం నేను జన్మలో మరిచిపోలేను.

అతని చేయి నా తలమీద, ఇంకోటి నా నడుం మీద ఉన్నాయి. అతను నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఇల్లు దగ్గరికి వచ్చేసింది. నేను లేచి సరిగ్గా కూర్చున్నాను. అతను నా భుజాలుపట్టి దగ్గరికి లాక్కున్నాడు నేను గువ్వలా ఆ చేతుల్లో ఒదిగి పోయాను.

''నా పిచ్చి సంధ్యా ! నా వెర్రి సంధ్యా'' అతను గొణుగుతున్నాడు

నేను మౌనంగా అతని చేతికున్న వాచీని సవరిస్తున్నాను. ఆటో ఇంటి ముందాగింది. నేను దిగాను. అతను ఆటో వాడిని ఒక్క నిముషం ఆగమని తను కూడా దిగి ''పద! నేను మీ అమ్మతో నచ్చచెప్తాను'' అన్నాడు.

నేను చప్పున అతన్ని ఆపేసి ''లేదు ! లేదు ! ముందు నేనే చెబుతాను. అమ్మ తప్పకుండా వింటుంది. ఇప్పటికే పొద్దుపోయింది'' అన్నాను అతను ''సరే అలాగే'' అని నా తలమీద ముద్దు పెట్టుకుని –

''నువ్వు పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు రోజూ లెటర్ వ్రాయి. మళ్ళీ రేపు వస్తాను'' అన్నాడు.

నేను సరేనన్నాను. ''గుడ్‌నైట్''. ఆటో కదిలింది.

''గుడ్‌నైట్'' నేను చెయ్యూపుతూ నిలబడ్డాను. ఆటో కనుమరుగు కాగానే నేను గేటు తీసుకుని వెళ్ళాను. నాలో ఉత్సాహం వచ్చేసింది. కిరణ్‌లో ఏదైనా మంత్రశక్తి ఉందా ! సంధ్యా అని పిలిస్తే చాలు నేను గువ్వలా కువకువలాడతాను.

గుమ్మంలో ఆటో శబ్దానికి కాబోలు అమ్మ వచ్చి నిలబడింది. నన్ను పట్టి దగ్గరికి లాక్కుని

''ఎక్కడికి వెళ్ళావే. ఎంత హడిలిచచ్చానో తెలుసా'' అంది భయంగా.

''ఏం లేదమ్మా ! కిరణ్ వచ్చాడు బొంబాయి నుంచి. సినిమా చూసి, హోటల్‌లో భోజనం చేసి వచ్చేసరికి ఆలస్యం అయింది'' సంజాయిషీగా అని లోపలికి వచ్చాను.

అమ్మ మాట్లాడలేకపోయింది. నేను గిర్రున తిరుగుతూ బ్యాగ్ టేబుల్‌మీద పారేసి వెళ్ళి లైటు తీసేసి పడుకున్నాను. ''జీవితవనం'' చిత్రంపైన బల్బు ఒకటి పెట్టాను. ఆ సన్నటి వెలుతురులో ఆ చిత్రం మెరుస్తోంది. ''నా జీవితవనంలో గండు కోయిల ఎప్పుడు కూస్తుందో'' పక్కకి తిరిగి పడుకుంటూ అనుకున్నాను.

## 23

''ఏమిటే సంధ్యా ! నువ్వంటున్నది ! నువ్వు కూడా పెళ్ళి చేసుకుంటావా'' అమ్మ నిర్ఘాంతపోయినదానిలా అంది. కళ్ళనుండి నీళ్ళు చెంపల మీదికి జారాయి.

నేను తలుపుమీద వేలితో రాస్తూ అవునన్నట్టుగా తలూపాను

''మరి మా దారి'' చివరికి ఎలాగో అంది

''చెప్పాను కదమ్మా. నా జీతమంతా నీకే ఇస్తానని'' మెల్లగా అన్నాను.

''నువ్విక్కడ ! అతను బొంబాయిలో ''
అమ్మ ఆగిపోయింది.

''మా తిప్పలు మేం పడతాం.''

''వీల్లేదు'' అమ్మ కోపంగా అంది.

''అమ్మా'' నేను విస్మయంగా అన్నాను

''అవునే ! పెళ్ళి చేసుకొని అత్తారింటికి వెళ్ళిన ఆడపిల్ల కుటుంబాన్ని ఆదుకుంటుందంటే నమ్మమంటావా ? మీ అత్తగారు ఊరుకుంటుందా? ముందు ఆ పిల్లాడు ఊరుకుంటాడా'' అమ్మ ముక్కు చీదేస్తూ అంది.

నేను గర్వంగా అన్నాను ''నీ రెండో అల్లుడికి కిరణ్ కి పోటీ పెడతావేమిటమ్మా.''

నేను ఎంత చెప్పినా, గంటసేపు బతిమాలినా అమ్మ ఒప్పుకోలేదు. ''అందరూ ఎవరిదారిన వారు పోతే మిగిలిన వాళ్ళ గతేంటి'' అని బావురుమంది

నేను ఛరుమన్నట్టుగా అన్నాను – ''నేనేం నిన్నుమల్ని గోదావర్లోముంచిపోవటంలేదుగా అమ్మా!''

అయినా అమ్మ ఏడుస్తూనే ఉంది. అందరూ






దిక్కుముఖాలేసుకుని కూర్చున్నారు. ఫల్గుణలేదు. ప్రపంచంలో ఏ తల్లి అయినా కూతురి సుఖానికి అడ్డు వస్తుందా! మరి అమ్మ? ఏమిటది. నా మాటంటే అసలు నమ్మకం లేనట్టే మాట్లాడు తోంది. నేను శశిలాగానే చేస్తానని భయమా! ప్రపంచంలో ఏ ఆడపిల్లా తన తల్లితో పెళ్ళి చేసుకుంటానమ్మా అని ఏడవదు. గోలపెట్టదు కానీ నా అదృష్టం ఏమిటి! కాళ్ళా వేళ్ళా పడాల్సి వస్తోంది. ఛీ! ఎంత సిగ్గులేని బ్రతుకైపోయింది. నాకు అసహ్యం కలగసాగింది.

అమ్మ ఆఖరుసారిగా అంది —

"సంధ్యా! నువ్వు ఈ పెళ్ళి చేసుకోదలుచుకుంటే మాకు ఇంత గుక్కెడు విషం ఇచ్చి హాయిగా పెళ్ళి చేసుకోమ్మా" అంది ఏడుస్తూ.

నేను కొరడాదెబ్బ తిన్నదానిలా లేచాను "నో! ఇంపాజిబుల్ నువ్వు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా నేను పెళ్ళి చేసుకుంటాను. కిరణ్ ని ఒదులుకోవడానికి నేను సిద్ధంగా లేను నేను ఉద్యోగం చేసినా చెయ్యకపోయినా నీకు నెలకు మూడు వందల రూపాయలు ఇస్తాను ఆ తర్వాత నీ ఇష్టం" అన్నాను అనేసి రివ్వున ఆఫీసుకి వచ్చేశాను.

కిరణ్ ఫోన్ చేశాడు. వాళ్ళన్నయ్యతో కొంచెం పని ఉందట. ఎక్కడికో వెళ్ళాలి, సాయంత్రం వస్తాను అని చెప్పాడు.

సాయంత్రం నేను వెళదామని ఇంటికి ఫోన్ చేశాను కుసుమ ఫోన్ తీసి "కిరణ్, వాళ్ళ బాబాయిగారింటి కెళ్ళాడు" అని 'నువ్వెవరు?' అంది అనుమానంగా.

"నేను సంధ్యను" అని ఫోన్ పెట్టేసి మధ్యాహ్నం లీవు పెట్టి రాజారావుగారింటికి వెళ్ళాను. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. తలుపులు కొద్దిగా తెరిచి ఉన్నాయి. నేను ముందు డ్రాయింగ్ రూమ్ లో ఎవరైనా కనబడతారేమోనని చూశాను. ఎవ్వరూ లేరు. కిరణ్ ప్రమీల గదిలో ఉంటాడేమోనని వెళ్ళి నెమ్మదిగా తలుపులు నెట్టి కొయ్యబారిపోయాను. లోపలి మంచంమీద కిరణ్ తల్లి అరుంధతమ్మగారు నిద్రపోతోంది. పక్కనే స్టూల్ మీద ఏవో మందులు ఉన్నాయి. నేను నిశ్శబ్దంగా తలుపులు చేరవేసి లోపలి గదిలోకి వెళ్ళాను. హఠాత్తుగా మాటలు వినిపించటంతో ఆగిపోయాను. రాజారావుగారి గదిలోనుండి రాధమ్మగారి గొంతు మృదువుగా వినిపిస్తోంది —

"అయినా! అంతా మా అక్కయ్యదురదృష్టం లెండి పెద్దకోడలికి వల్లమాలిన గర్వం. కనసం కిరణ్ దగ్గరన్నా కాస్త విశ్రాంతిగా గడుపుదామనుకుంటే వాడేమో సంధ్యను తప్ప ఛస్తే ఇంకొకళ్ళని చేసుకోను అంటాడు. పోనీ చేసుకున్నా, సంధ్య ఈ హైదరాబాద్ లో ఉండి ఉద్యోగం చేయాల్సిందే. వాళ్ళ కుటుంబాన్ని పోషించాల్సిందే. ఇంక మా అక్కయ్యకి విశ్రాంతి ఎక్కడ."

నేను నిశ్చేష్టురాలిలా నిలబడిపోయాను. అయితే ఒక్క నేనేగాదు. ఇటు కిరణ్ కూడా ఇన్ని సమస్యలను ఎదుర్కొంటున్నాడన్న కొత్త విషయం నాకు ఇప్పుడే ఈ క్షణానే తెలిసింది.

రాజారావుగారు అంటున్నారు —

"పాపం! సంధ్య ఎంత బుద్ధిమంతురాలు. పెళ్ళి చేసుకున్నా కుటుంబాన్ని పోషించాలంటే మాటలా? ఆ పిల్లకి ఆ మాత్రం శ్రద్ధ ఉంది కాబట్టే ఆ సంసారం ఆ విధంగా ఉంది" ఆ మాటల్లో నా మీద ఆయనకున్న ఆప్యాయతాను రాగాలు నిండుగా తొణికిసలాడాయి.

"ఇప్పుడు మా అక్కయ్య అనేది అదే కదండీ! ఆ అమ్మాయి అంత కష్టపడి తన వాళ్ళకోసం అంత తాపత్రయపడుతుంటే, నీమీదే ఆశలు పెట్టుకుని బ్రతుకుతున్న నా గురించి ఆలోచించరా కిరణ్ అని అక్కయ్య ఏడిచింది కదండీ" అంటోంది రాధమ్మగారు.

"ఒక్క రెండు సం॥లు కళ్ళు మూసుకుంటే మీ అక్కయ్యకెమిటట. అంతగా అయితే ఇక్కడ మన దగ్గర ఉండకూడదూ, హాయిగా ఉంటుందిగా" రాజారావుగారు చిరాగ్గా అంటున్నారు.

"బాగుందండీ! ఇద్దరు కొడుకులుండీ, చెల్లెలు పంచనపడి బ్రతకటానికి మా అక్కయ్యకి ఏం ఖర్మండి" అంది రాధమ్మగారు.

"అందుకని! బంగారంలాంటి ఆ పిల్లల జీవితాల్లో ఎందుకు మనం ఆటజడులు రేపాలి చెప్పు. కాస్త వింటాను" కోపంగా అన్నారు.

"సంధ్య వాడిభార్య అయితే సంతోషించే వాళ్ళలో నేను మొట్టమొదటిదాన్ని. కానీ మా అక్కయ్య వాదన మీరూ విన్నారుగా. సంధ్య హైదరాబాదులో ఉంటే తను కొడుకు దగ్గర ఎలా బ్రతకాలి. నాకు సేవలు ఎవరు చేస్తారు అని మొత్తుకుంటోందండీ" బాధగా అంటోంది రాధమ్మగారు.

"అదీ నిజమే. ఈవిడసలే అనారోగ్యం మనిషి. హమేషా ఒక మనిషి దగ్గరుండాలి. ఎలా కుదురుతుందబ్బా" రాజారావుగారు.

"ఏమోనండీ! మొదటినుంచీ మా అక్కయ్య కష్టాలు పడుతూనేవుంది. నలుగురిని పెట్టి చేయించుకోడానికి ఆస్తిపాస్తులు కూడా లేవు. వాళ్ళ ఉద్యోగాలే వాళ్ళకి దిక్కు" రాధమ్మగారు బాధగా అంటోంది.

"సరే చూద్దాం! ఈ సమస్య ఆ కిరణ్ బాబే పరిష్కారం చేయాలి. కాసేపు పడుకో."

"ఆ... సరే... సరే మీరూ పడుకోండి."

"అన్నట్టు మీ అక్కయ్యకి మందు ఇచ్చావా?"

"ఆ...! నిద్రపోతోంది."

"కిరణ్ ఎక్కడికో వెళ్ళినట్టున్నాడుగా?"

ఇక ఆపైన ఏ శబ్దం లేదు. నేను నిశ్చేష్టరాలిలా నిలబడిపోయాను. నాకు భూమిమీద కాళ్ళు ఆనటంలేదు. భూమి బ్రద్దలై అందులో కూరుకుపోతున్నట్లుగా ఉంది.

నా విషయంలో కిరణ్ వాళ్ళ అమ్మతో అంతగా దెబ్బలాడేడా. అవును నిజమే. అతను అంటూనే ఉన్నాడుగా. 'సంధ్యా మనం పెళ్ళి చేసుకుని అమ్మను జాగ్రత్తగా చూసుకుందాం' అని. అతను నన్ను పెళ్ళి చేసుకుంటే అతనికి మిగిలే సుఖం ఏది? అనుక్షణం చికాకులు తప్పేవి.

నేను కిరణ్‌ని పెళ్ళి చేసుకోవాలి. వాళ్ళమ్మగారికి సేవ చెయ్యాలంటే బొంబాయి వెళ్ళితీరాలి. మరి నా కుటుంబం! నా కుటుంబాన్ని పోషించాలంటే నేను హైదరాబాద్‌లోనే ఉద్యోగం చేయాలి. బొంబాయిలో ఉద్యోగం దొరుకుతుందన్న నమ్మకం ఏమిటి? మై గాడ్! మై గాడ్!

నాకు చెమటలు పోస్తున్నాయి. కాళ్ళల్లో వణుకు పుడుతోంది. కిరణ్ ఉద్దేశ్యమేమిటి? అతను నన్ను ఒదులుకోలేడు. తల్లిని సమాధాన పరచలేడు. మరి నేను, మా అమ్మని సమాధాన పరచలేను. ఇటు కిరణ్‌ని ఒదులుకోలేను భగవంతుడా! నేను బస్‌స్టాప్‌కి ఎలా వచ్చానో, ఎలా ఇంటికి వచ్చానో గుర్తులేదు.

ఆవేళప్పుడు నేను ఇంటికి వచ్చేసరికి ఉష ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటి నీకు కాలేజీ లేదా?" అన్నాను అక్కడున్న కుర్చీలో కూలబడుతూ.

"మధ్యాహ్నం అవర్స్ లేవు" అంది ఉష.

ఇంతలో మీనా మంచినీళ్ళ గ్లాసుతో వచ్చింది. ఇప్పుడు మీనా ఇంటర్ చదువుతోంది. కొత్తగా కాలేజీలో చేరటంమూలాన దానికి బాడీగార్డులా ఎప్పుడూ ఉష ఉంటుంది. అందుకే అదికూడ ఇంటికి వచ్చేసిందట.

"అమ్మ ఏదీ?" అన్నాను.

"పెరట్లో ఉంది" అంది ఉష.

నాకు కణతలు బద్దలయిపోతున్నాయి. ఒక కప్పు టీ తాగితేకానీ మనిషిని అయ్యేలాలేను. నేను వంట గదివైపు వెళ్ళాను. స్టవ్ వెలిగించి డికాషన్‌కి నీళ్ళు పెట్టబోతూ ఆగిపోయాను. ఒకపక్కగా ఫ్లాస్కు కనిపించింది. అందులో కాఫీకానీ ఉందేమోనని మూత తీశాను. ఫ్లాస్కులో వేడి వేడి టీ చూడగానే నాకు ప్రాణం లేచివచ్చినట్టయింది. స్టవ్ ఆర్పేసి కప్పులోకి టీ వంచుకున్నాను.

నా చెవుల్లో రాధమ్మగారు అన్న మాటలే ఇంకా గింగుమని మ్రోగుతున్నాయి. కిరణ్ తల్లికి ఆ మాత్రం కోరిక ఉండటం అసహజం ఏమీకాదు. నా జీవితం ఏమవుతుందో? నేను సుడిగుండంలో పడిపోయిన మనిషిలా ఉన్నాను. వెధవ బ్రతుకు నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కొనగోటితో కన్నీళ్ళు తుడుచుకుంటూ కప్పు నోటిదగ్గర పెట్టుకోబోయాను "సంధ్యా" అమ్మ గొంతు ఆర్తనాదంలా వినిపించటంతో చప్పున తిరిగిచూశాను. అమ్మ ఒక్క అంగలో నా దగ్గరికి వచ్చి –

"ఆ... ఆ.. టీ... తాగావా?" అంది వణికిపోతూ.

"చాలా తలనొప్పిగా ఉందమ్మా" సంజాయిషీగా అన్నాను.

"తాగకు" అమ్మ కళ్ళల్లో ఎందుకంత భయం?

"అబ్బ చెప్తుంటే వినవ్వేం. ఒక్క చుక్క గొంతులో పడితేకానీ మనిషిని కాను" అని మళ్ళీ తాగబోయాను.

"సంధ్యా తాగకు! తాగద్దు! తాగద్దు" అమ్మ కెవ్వున అరుస్తూ వచ్చింది. వస్తూనే నా చేతిలో కప్పుని ఫట్‌మని కొట్టింది.

టీ కప్పు క్రిందపడి బద్దలైపోయింది ఆ టీ






# సంపూర్ణ పోషకాహారంలో వుండవలసినవన్నీ కలిసివున్న రుచికరమైన పదార్థం

# సిరిలాక్®

## ఇన్‌స్టెంట్ వీట్ మిల్క్ సీరియల్

ఇవ్వగలిగినంత కాలం మీ పాపకి చనుపాలు యివ్వండి—మీరు యివ్వగలిగిన మంచి ఆహారం అదే. 4 నెలల ప్రాయం వచ్చేసరికి పాపకి ఎక్కువగా పోషక పదార్థాలు కావాలి. ఘన పదార్థాలు తీసుకోడానికీ పాప సిద్ధంగా వుంటుంది. సిరిలాక్ యివ్వడం వలన, పాలు యివ్వడం మానకుండా పాప ఆహారంలో ఘన పదార్థాలు ప్రవేశ పెట్టడం గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి.

మీ పాపకి సరిఅయిన పాళ్లలో పోషక పదార్థాలు అందించడానికి సిరిలాక్‌లో గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు మరియు చక్కెర ఉన్నాయి. పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు శక్తి నివ్వడానికి, మాంసకృత్తులు పెరుగుదలకి, విటమిన్లు మరియు ఖనిజాల లోపాల నుండి రక్షణ కలిగించడానికి దీనిలో ఉన్నాయి. సిరిలాక్—మీ పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.

**సిరిలాక్**–పాలు వుండనే వున్నాయి

దీనిని తయారు చేయడం చాలా సులభం.
—దీనితో ముందుగా మరగబెట్టిన గోరువెచ్చని నీరు చేర్చండి.



ముందుగా మరగబెట్టిన నీటితో సెరిలాక్ చేర్చండి



బాగా కలపండి



వెంటనే యిచ్చేందుకు తయారు

SAA/FSL/C/2258 TEL

NESTLÉ







అంతా అక్కడున్న గిన్నెలమీద, డబ్బాలమీద, బండల మీద చెల్లాచెదురుగా ఎవరో పిచికారీ చేసినట్టుగా పడిపోయింది.

"అమ్మా" నేను అయోమయంగా చూశాను

అమ్మ హఠాత్తుగా నన్ను కావిలించుకుని ఏడవసాగింది. ఈ గలాభాకి ఉష, మీనా పరిగెత్తు కొచ్చార

"అక్కా !" ఉష వేలితో చూపిస్తూ భయంగా ఆగిపోయింది. అమ్మ ఎందుకలా చేసింది ! నేను అర్థంకాక క్రిందికి చూశాను. అమ్మ నోటితో చెప్పలేని సమాధానం నాకు ఇప్పుడు దొరికింది. క్రిందపడిన టీలో ఈగలు గిలగిల కొట్టుకుని ఇది విషం అని నాకు చెప్తున్నట్టుగా చచ్చిపడున్నాయి.

"అమ్మా" నేను కెవ్వుమన్నట్టుగా అమ్మని దగ్గరికి లాక్కున్నాను.

"సంధ్యా" అమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

నేను అమ్మని వదిలి ఫ్లాస్కు తీసి చూశాను నా అనుమానం ధృడపడింది. అమ్మ ఇంకా ఏడుస్తూనే ఉంది.

"ఇందాక అమ్మ నల్లులమందు తెమ్మంటే ఎందుకో అనుకున్నాను" మీనా ఏడుస్తూ అంది.

నేను ఆగ్రహంగా అమ్మ దగ్గరికి వచ్చాను.

"అమ్మా ! ఏమిటిది ? ఎందుకు చేశావీ పని"

"నాకు ఏం తెలీదు. నన్నేం అడక్కు."

"కారణం లేకుండానే నువ్వు ఈ పని చేస్తున్నావా ?"

"కారణం నీకు తెలీదుటే" అమ్మ ఎఱ్ఱబడిన కళ్ళతో తీక్షణంగా చూస్తూ అంది.

"అమ్మా!" నేను కరెంట్ షాక్ తగిలినదానిలా వెనక్కి తగ్గాను.

"అవునే ! ఎవరి దారిన వాళ్ళు పోతుంటే ఈ సంసారం ఈడవటం నా చేతకాదు. కన్న నేరానికి నేను... నేనే నాకు శిక్ష వేసుకుంటున్నాను."

నేను నిశ్చేష్టురాలిలా చూస్తున్నాను. అమ్మ ఇంకా అంటోంది—"శశి పెళ్ళి చేసుకుని అత్తవారింటికి వెళ్ళింది. నీ దారి నువ్వు చూసుకుంటున్నావు. పెళ్ళయిన ఆడపిల్లలమీద ఆధారపడి బ్రతకటం ఎంత బాధాకరమైన విషయమో నీకు తెలీదు. ఈ అవమానాలు, ఈ కష్టాలు నేను పడలేను. నేను చచ్చిపోతాను."

ఇంతలో ఫల్గుణ ఎప్పుడు వచ్చాడో –

"అమ్మా ! పోనీవే ! అక్కయ్యని పెళ్ళి చేసుకోనీ దాని సుఖానికి మనం ఎందుకు అడ్డు రావాలి. నేను చదువు మానుకుంటాను. ఏదైనా ఉద్యోగం దొరక్కపోదు" అన్నాడు అమ్మని దగ్గరికి తీసుకుని.

"ఫల్గుణా" నేను బిగ్గరగా అరిచాను.

"పోనీ అక్కా ! నీకు చేతనైంది నువ్వు చేశావు" అన్నాడు ఫల్గుణ.

అమ్మ రోషంగా అంది, "ఈ భాగ్యానికేరా నిన్ను డాక్టర్ చదివిస్తోంది" అంది.

ఫల్గుణ కోపంగా అన్నాడు "ఆ ఉద్యోగంలో నేను చేరతానక్కా అంటే, వీల్లేదు. నువ్వు నాన్న కోరిక తీర్చాలి. డాక్టర్‌వి కావాలి అన్నావు. మరి మధ్యలోనే నా చదువు నట్టేట్లో ముంచి నీ దారి నువ్వు చూసుకుంటున్నావు" తుపాకీ గుళ్ళల్లా ఉన్నాయి వాడి ఒక్కో మాట.

"నేను పెళ్ళి చేసుకున్నా, నా జీతం ఇంట్లో ఇస్తాను అన్నాను కదమ్మా !" వణుకుతున్న స్వరంతో అన్నాను.

అమ్మ అగ్నిజ్వాలలాగా లేచింది – "ఆ... శశి నీకన్నా పెద్ద కబుర్లే చెప్పింది. అది ఏమాత్రం చేసింది. రేపు నువ్వూ అంతే."

"పోనీమ్మా ! తిండి లేకపోతే పస్తులుంటాం. కూలీ చేసి అయినా మిమ్మల్ని పోషించుకుంటాను. నువ్వు చచ్చిపోతే మాకెవరమ్మా ?" ఫల్గుణ బావురుమన్నాడు.

నేను మతిపోయినదానిలా చూస్తున్నాను. ఉష, మీనా కూడా వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

"అమ్మా ! ఇక ఎప్పుడైనా ఇటువంటి పనులు చేశావంటే నాన్నమీద ఒట్టే" అంటున్నాడు ఫల్గుణ. "నాయనా" అమ్మ ఏడుస్తోంది.

నేను నిద్రలో లేచి నడుస్తున్నదానిలా గదిలోకి వచ్చేశాను.

మర్నాడు –

"ఏమిటిసంధ్యా అలా ఉన్నావు" అన్నాడుకిరణ్.

"ఏంలేదు" నేను మెల్లగా అన్నాను.

"డోంట్‌వర్రీ సంధ్యా" కిరణ్ నా చెయ్యి నొక్కుతూ అనునయంగా అన్నాడు. నేను మాట్లాడ లేదు. రాత్రంతా నేను నిద్రపోలేదు. కిరణ్ బొంబాయి వెళ్ళిపోతుంటే నేనూ ఎయిర్‌పోర్టుకి వచ్చాను సెండాఫ్ ఇవ్వడానికి. ఇంతలో ప్లేన్ బయలుదేరబోతున్నట్టుగా ఎనౌన్స్‌మెంట్ వినిపించటంతో ఉలిక్కిపడ్డాము. ఇద్దరం ఖాళీ అయిన కాఫీ కప్పులు టేబుల్‌మీద పెట్టేసి ఒకరినొకరం చూసుకుంటూ కూర్చున్నాం హఠాత్తుగా కిరణ్ వెళ్ళిపోతాడు అనిపించేసరికి నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"యూ సిల్లీ గర్ల్" కిరణ్ కసిరాడు. ఇద్దరం ఇవతలకి వచ్చాము. కిరణ్ మృదువుగా నా చేయి నొక్కి వెళ్ళిపోయాడు.

నేను బొమ్మలా నిలబడిపోయాను. కిరణ్ గుమ్మంలో ఆగి నాకు చెయ్యూపి వెళ్ళిపోయాడు. నా కళ్ళనుండి జలజలా కన్నీళ్ళు రాలాయి. ప్లేన్ రెక్కలు చాచి ఎగురుతున్న పక్షిలా రివ్వున ఆకాశంలో ఎగిరి చుక్కలా మాయమైంది. అయిపోయింది ! నా కిరణ్ రానూ వచ్చాడు ! పోనూ పోయాడు. కానీ నా సమస్య మాత్రం పరిష్కారం కాలేదు.

నేను కిరణ్‌ని పెళ్ళి చేసుకోవాలా ! ఒద్దా ? అన్న మీమాంశ నాలో బయలుదేరింది. ఇది నేను నా జీవితంలో ఊహించని విషయం. మా పెళ్ళివల్ల అటు అరుంధతమ్మగారికి సుఖంలేదు. ఇటు నావాళ్ళకీ సుఖంలేదు ! అతనుకూడా బాగా దిగులు పడ్డ మనిషిలా అయ్యాడు. నేను ఈ 'ప్రేమ' అనే నడిసముద్రంలో చిక్కుకుపోయాను. ఏ ఒడ్డు చేరతానో నాకే తెలీటంలేదు. అప్పటివరకూ రంగు రంగుల పూలతోటలా నన్ను భ్రమపెట్టిన నా భవిష్యత్తు ఇప్పుడు అంధకారంలా, బ్రహ్మ రాక్షసిలా నన్ను భయపెడుతోంది. టప్ ! టప్ !! మని నా కళ్ళనుండి నీళ్ళు జారి చెంపలమీద పడ్డాయి

**(ఇంకా వుంది)**

# అలసట చేత ఇంట్లో చదవ లేవా?



ఇది మీరు నమ్మిన
గ్లాకోజ్-డి యొక్క
కొత్త పేరు

# గ్లూకోన్-డి ®

**ఆదనపు శక్తికోసం—అలా**
**అతనికి కావలసినప్పుడు**

సేద తీర్చడానికి, చల్లదనానికి శక్తినిచ్చే గ్లూకోన్-డి. గ్లాక్సో కంపెనీ నుంచి వచ్చిన విటమిన్-డి మరియు కాల్షియం ఫాస్ఫేటులతో బలపరచబడిన అసలైన గ్లూకోజ్ పౌడరు, దాన్ని ఏ పానీయం లోనైనా సరే కలపండి—పళ్లరసం, పాలు, టీ, కాఫీ, నీరు. లేకపోతే దేనితో కలపకుండా అలానే తీసుకోండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే <u>అనుభూతిని</u> పొందండి.




అందరికీ పరిచయమున్న
అదే ఆకుపచ్చ ప్యాక్‌లో
దొరుకుతుంది.



**గ్లూకోన్-డి ®** నమ్మకంగా తిరిగి శక్తి నిచ్చే **గ్లాక్సో** వారి తయారీ

( గత సంచిక తరువాయి )

























[ఇంకా ఉంది]

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

---



# ఫాలాక్షుని డైరీ



## నల్లడబ్బు!

భారతదేశంలో నల్లడబ్బు విరివిగా ఉంటుందనే విషయం అందరికీ తెలిసిన రహస్యం. ఆదాయపన్ను శాఖవారు సరదా కప్పుడప్పుడు కలవారిమీద విరుచుకుపడి, ఆ డబ్బు పట్టుకుని, బోర విరుచుకుంటుంటారు. ఈ సంవత్సరం జనవరి నుంచి నవంబరు చివరి వరకూ వీరు జరిపిన 3109 శోధనలలో, పరిశోధనలలో 24 కోట్ల 67 లక్షల విలువచేసే, నగా, నట్రా, డబ్బూ దస్కం దొరికాయట. తమిళనాడులో ఏప్రియల్ నుంచి అక్టోబరు వరకూ జరిపిన వివిధ సోధనలలో కోటి నపైర దొరికిందట. ఇందులో నటీమణులు శ్రీదేవి, శ్రీప్రియ, నటులు రజనీకాంత్ వంటి వారిళ్ళు కూడా శోధింపబడ్డాయట. ఈ రకం వాటికి పాపం నటీనటుల ఇళ్ళు పుట్టిళ్ళు—

## కాలువలో కరెంటు తీగలు!

ఎలుకల బాధ పడలేక కేరళ కొట్టాయానికి చెందిన రామాపురంలో ఇద్దరు వ్యవసాయదారులు తమ పొలంలోని నీటి పంట కాలువలో కరెంటు తీగలు వేశారట. ఈ విషయం మరచిపోయి 28 నవంబరు రాత్రి వారే ఆ నీళ్లలో కాలేసి, అక్కడికక్కడే చనిపోయారట.

## ప్రకటనలకే 120 లక్షల డాలర్లు!

సర్ రిచర్డ్ ఎట్టెన్‌బరో 22 మిలియను డాలర్ల వ్యయంతో, అది మించిన ప్రయాసలతో అన్నిటికీ వోర్చి "గాంధి" సినిమాను తీసి, తన 20 సంవత్సరాల కోర్కె తీర్చుకున్నాడు. ఆ సినిమా లండనులో "డబ్బింగ్" ముస్తాబు చేసుకుంటోందట. కొలంబియా పిక్చర్స్‌వారు ప్రపంచ హక్కులు తీసుకున్నారట. 12 మిలియను డాలర్లు కేవలం ఈ సినిమా గురించి చేసే ప్రకటనలకే కేటాయించారట. ఈ సినిమా బహుశా ఏ ఇతర హాలీవుడ్ సినిమా సంపాదించనంత ధనం, కీర్తి సంపాదించుతుందని తనకు నమ్మకంగా ఉందని కొలంబియా చైర్మెన్ ఫ్రాంక్ ప్రయిజ అన్నారట. న్యూయార్క్ టైమ్స్ పత్రిక కూడా గాంధి పాత్రధారి బెన్ కిన్స్‌లె నటన, 'ఆహార్యం అమోఘమని వర్ణించిందట. దీన్ని భారతదేశంలో కూడా విడుదల చేస్తారట.'

## డబ్బుకోసం!?

మద్రాసు సెక్రెటేరియట్‌లో పనిచేస్తున్న 33 ఏళ్ల అనంతనారాయణ మద్రాసు టెలిఫోను శాఖలో పనిచేస్తున్న 30 ఏళ్ల సులోచన నే అమ్మాయిని రెండేళ్ల క్రితం వివాహం చేసుకున్నాడట. ఆనక ఆమె పోకడ తనకు నచ్చక, ఆమెను ఉద్యోగం మానెయ్యమన్నాడట. దాంతో ఆమె ఇల్లు వదిలి, త్రిప్లికేనులో ఉన్న తన తల్లితో ఉండసాగిందట. పలుసార్లు అనంతనారాయణ ఆమెను చూడ ట్లినా అతని అత్తగారు 60 ఏళ్ల సుందరవల్లి పడనీయక, అసలు తన కూతురు తనతో కూడా ఉండటం లేదన్నదట. డబ్బు దాహంలో పడి ఆమె సులోచన చేత వ్యభిచారం చేయించుతోందట. ఈ విషయం తెలిసిన అనంతనారాయణ ఆవేశంతో తన అత్తగారిని పొడిచి చంపేశాడట.

## పట్టపగలు దారుణ హత్యలు!

కొందరు గూండాలు ఫైజాబాద్‌లోని షా షాపు మీదికి దండెత్తి అర్జంటుగా ఇరవై వేలివ్వకపోతే నీ కుటుంబాన్ని నాశనం చేస్తామని టయిమిచ్చి చక్కాపోయారట. ఆ షాపు యజమాని వీరి హెచ్చరికను లక్ష్యపెట్టక, అంతతో ఆగక, పోలీసు రిపోర్టిచ్చాడట. దాంతో వారు అతని ఇంటి మీదపడి అతని భార్యను, తల్లినీ నాలుగేళ్ల కూతురినీ నరికించేసి, రెండో కూతురు కోసం ఇల్లంతా వెతికి, స్నానం చేస్తున్న ఆ మూడు ఏళ్ల పసి పిల్ల తలను ఒకే వేటుతో నరికి వేరు చేసి చక్కాపోయారట. ఇది పట్టపగలు జరిగిందట.

## "ఇలా చేస్తే ఎలా?"

బరోడా విశ్వవిద్యాలయం విద్యార్థుల ఎన్నికలలో ఎన్నికయినవారిని సభినందించే సభలో తత్కాల వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ మికువార్, ఎస్. మిర్కి మాట్లాడేందుకు లేవబోయేసరికి సుమారు 300 మంది చీత్కారాలు చేసుకొంటూ మూకుమ్మడిగా అల్లరి చేస్తూ ఆయన మీద పడి ఆయన్ని స్టేజి మీంచి లాగేశారట. ఏక కంఠంతో తమ కోర్కెలు చెప్పి వెనువెంటనే నెరవేర్చమని ఒత్తిడి చేశారట. దీనికి నిరసనగా ఆయన లేచి, సభలోంచి వెళ్లిపోవాలని ప్రయత్నించేసరికి ఆయన కారు చక్రాల టైర్లు తెరిగిపారేశారట. అసలు వారి కోర్కెలేవిటో ముందు చెప్పనేలేదు. టయిమూ ఇవ్వలేదు. ఇలా చేస్తే ఎలాగయ్యా విద్యార్థులు అన్నారటాయన. విద్యారంభం కరిష్యే....!

## హరిజన బాలల్ని దత్తత చేసుకున్న సవర్ణులు!

అస్పృశ్యతా నివారణకు బద్ధకంకణుల్లై నడుం బిగించి మధురకు చెందిన హిందూవులలో కొందరు హరిజన పిల్లలను పెంపకానికి దత్తత తీసుకుని, వారిని చక్కని హాస్టళ్లలో చదువులకని చేర్పించారట.





# ఫాలాక్షుని డైరీ

## విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుని హత్య !

మేఘాలయకు చెందిన షిల్లాంగ్ నార్త్ ఈస్టరన్ హిల్ యూనివర్సిటీలోని అధ్యాపకులు, విద్యార్థులలో జాతి తెగల పట్టింపులు వచ్చి, రెండుగా విడిపోయారట. తత్ఫలితంగా అక్టోబరు 30వ తేదీన రాత్రి ఏడున్నర గంటలకు ఆ విశ్వవిద్యాలయ తాత్కాలిక వైస్ చాన్సలర్ డాక్టరు భాస్వరును ఆయన ఇంట్లో ఎవరో కిటికీలోనుంచి కాల్చిచంపేశారట. ఈ సందర్భంగా రీడర్‌గా పనిచేస్తున్న డాక్టర్ జోసెఫ్‌ను, ఇంగ్లీషు లెక్చరరుగా పాల్ పిమాయోను, లైబ్రేరియను నాగులిని, ప్రదీప్ గొగొయ్ అనే అస్సాం విద్యార్థి నాయకుడిని అరెస్టు చేశారట.

## దాహం వేసినప్పుడే బావి త్రవ్వటం అంటే ?

మెదడు జ్వరం ఇటీవల అతి తీవ్రంగా వచ్చి పిల్లలను పెద్దపెట్టున పొట్టన పెట్టుకుంటున్నది. తమిళనాడు, ఆంధ్ర, కేరళ, పాండిచ్చేరి రాష్ట్రాల మీద ఈ జబ్బు వీరవిహారం చేసి వందలకొద్దీ పిల్లలను పొట్టన పెట్టుకోడంతో ఈ నాలుగు రాష్ట్రాల ప్రభుత్వాలూ కలిసి దీనికి ఏదయినా మందు కనిపెట్టాలనే తీవ్ర నిశ్చయానికి వచ్చారట.

## మరి జీతం మాటేమిటి ! ?

కనకపురంలోని ఓ ప్రయివేట్ కాలేజీలో లెక్కల లెక్చరరుగా పనిచేస్తున్న కోదండరామయ్యగారు 1972 జనవరి 28వ తేదీన తన మామగారు చనిపోయిన కారణాన్న ఒకే ఒక్క రోజు సెలవు పెట్టారట. ఆ కారణంగా ఆయన్ని ఆ కాలేజీ అధికారులు ఉద్యోగం నుంచి తొలగించారట. ఆయనీ విషయం కోర్టు ద్వారా తేల్చారట. కర్నాటక హైకోర్టు చెప్పినా, విశ్వవిద్యాలయం చెప్పినా కూడా ఆ కాలేజీ అధికారులాయనకు తిరిగి ఉద్యోగమివ్వలేదట. చివరికి రాష్ట్రప్రభుత్వము కలుగజేసుకొని ఆయనకు పదేళ్ల తరువాత తిరిగి ఆ ఉద్యోగమిప్పించారట. ధాంకేది చీఫ్ మినిస్టర్ ! అయినా గాని ఆయనకా పదేళ్ల జీతమూ వస్తుందా ?

## చైర్మన్‌గారికి చెత్త కుప్ప !

షిమోగా వూరు వూరంతా అపరిశుభ్రానికి మారుపేరుగా ఉన్నదని, రోడ్లు వూడవడం అనే విషయం ఆ వూరికి బొత్తిగా తెలీని విషయమని, మునిసిపాలిటీ వారు ఏం చేస్తారో, చేస్తున్నారో తమకు తెలీదని వూరులోని ప్రజలు కినుకవహించి, మునిసిపాలిటీ కన్నులు తెరిపించాలని వూళ్లోని రోడ్ల మీది పేడ, చెత్తా, చెదారం వో బుట్టడు తీసుకుని మునిసిపల్ చైర్మన్‌కు బహూకరించ బయలుదేరి, అనక మనసు మార్చుకుని ఆ చెత్తను ఆయన గదిలో పారబోదామని తీర్మానించుకొని, అదీ బద్దలే అనుకొని ఆ ఆఫీసు ముందు కుప్పగా పోశారట.

# మరుగుదొడ్డిని గట్టిగా రాసేపని లేదిక.



## శానిఫ్రెష్ చిలుకరించండి చాలు...

మీ మరుగు దొడ్డిని తళతళలాడేల్లా, క్రిములు చేరకుండా చేసేందుకు సులభ మార్గం.
















పరిమళం చిందించే

**శానిఫ్రెష్**

**అధునాతనమైన మరోపద్ధతి.**

**బల్సారా**

—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

CHAITRA-BLS-437 TEL

# వంటలు



## రేడిష్ రంగోలి బాత్

కావలసిన వస్తువులు: లేత ముల్లంగి దుంపలు – 6, ఆనియన్స్ 4, పచ్చిమిర్చి – 10, అల్లం – చిన్న ముక్క, ఉప్పు – తగినంత, కొత్తిమిరికట్ట, జీడిపప్పు – 50 గ్రా., కరివేపాకు, పసుపు – టీ స్పూను, పులావు బియ్యం – అరకిలో, డాల్డా–100 గ్రా., మసాలా సామాను: గసగసాలు, ధనియాలు, జీలకర్ర కొంచెం, యాలకులు – 4, లవంగాలు – 2, దాల్చిని – 4 రెక్కలు, ఎండుమిర్చి–10, బన్‌రొట్టె-1.

తయారుచేయు విధము: పలావుబియ్యం కడిగి గిన్నెలో పసుపు వేసి బియ్యం పోసి విరుగ పదునుగా అన్నం వార్చుకోవాలి. ముల్లంగి కడిగి సన్నని చెక్కు తరిగి అల్లం, పచ్చిమిర్చి, ఉల్లి చెక్క తరిగి, జీడిపప్పు మొత్తం డాల్డాతో వేయించి తగినంత ఉప్పువేసి గ్లాసు నీరుపోసి సన్నని సెగను పావుగంట ఉడకనివ్వాలి. ముల్లంగి మెత్తబడిన తరువాత పై మసాలా దినుసులు మెత్తగా రుబ్బుకొని ఆ ముద్దను కొంచెం డాల్డా వేసి బన్‌రొట్టె ముక్కలతో వేయించి ఈ మిశ్రమాన్ని వార్చిన అన్నంలో కలిపి ఒక పెద్ద ప్లాటి బేసిన్‌లో వెయ్యాలి. వేడిగా వున్నప్పుడు కరివేపాకు కొత్తిమిరి కలిపి బేసిన్‌పై మూత పెట్టాలి. పులుపు కావలసినవారు నిమ్మరసం పిండుకుని తింటే చాల రుచిగా వుంటుంది. ఈ రేడిష్ రంగోలీ బాత్ ఉదయం టిఫిన్‌కి ఉపయోగించవచ్చును. ఉల్లి పెరుగుపచ్చడితో కలుపుకుని తింటే చాల రుచిగా వుంటుంది.

— రమణాప్రకాష్

## కాలీఫ్లవర్ ఎగ్ ఫ్రై

కావలసినవి: ఎగ్స్ –2, కాలీ ఫ్లవర్ చిన్నది–1, గరంమసాలా – రుచికికొద్దిగా, ఎర్రవుల్లి – పెద్దది 1, పచ్చిమిర్చి 1, కారంపొడి – 2 పెద్ద చెంచాలు, పసుపు – చిటికెడు, నూనె 150 గ్రా.. ఉప్పు – తగినంత.

చేయు పద్ధతి: కాలీఫ్లవర్ చిన్న చిన్న ముక్కలుగా కోసి శుభ్రపరచి, ఉల్లి, పచ్చిమిరప కోసుకోవాలి. మూకుడులో నూనెవేసి, ఉల్లి, పచ్చిమిరప కొద్దిగా వేపి, గరంమసాలా ముద్ద కూడా ఎర్రగా వేగాక కాలీఫ్లవర్ ముక్కలు వేసి సన్నసెగపై మంచి మూత పెట్టాలి. తర్వాత కారంపొడి, పసుపువేసి అప్పుడప్పుడూ అడుగంటకుండా కలుపుతుండాలి. ఈ లోగా వేరే గిన్నెలో ఎగ్స్‌ని కొట్టి, బాగా గిలక్కొట్టి, కాలీఫ్లవర్ బాగా మగ్గి, వేగాక వేయాలి. దీనంతటికీ సరిపడే ఉప్పు గుండను కూడా అప్పుడే వేసుకుని గుండలా అయ్యేటట్లు ఎగ్స్‌ని బాగా కలపాలి.

— ఎల్. వి. ఉమ

## మట్టర్ చావల్

కావలసినవి: బియ్యం - అరకేజీ, బఠాణీలు – పావుకేజీ, బంగాళా దుంపలు – పావుకేజీ, ఉల్లిపాయలు – పావుకేజీ, డాల్డా - 100 గ్రా., పెద్ద ఏలకులు – 100 గ్రాములు. (వీటినే ఇలాచీ అని కూడా అందురు) కొబ్బరికాయ – ఒకటి, పచ్చిమిరప కాయలు – 50 గ్రాములు.

చేయు విధానము: ముందుగా బఠాణీలు నానబెట్టి, నానిన వాటిని ఉడికించి ఉంచుకోవలెను. బంగాళా దుంపలు పెద్ద ముక్కలుగా చేసి ఉడికించాలి. అన్నం బాగా పొడిగా ఉండేటట్లు చూసి వార్చుకోవాలి. కొబ్బరి తురుముకొని, ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిర్చి వేసుకొని బాగా రుబ్బాలి. ఈ రుబ్బిన ముద్దను, బఠాణీలను, ఉడికించిన బంగాళా దుంపలను తగినంత ఉప్పు వేసి అన్నంలో డాల్డాపోసి బాగా కలపాలి. పెద్ద ఏలకులను బాగా పొడిచేసి పై మిశ్రమంలో బాగా కలిపేటట్లు కలపాలి. మట్టర్‌చావల్ తినుటకు చాలా బాగుంటుంది. దీనిలోకి ఉల్లిపాయ పెరుగుపచ్చడి వంచుకొందుకుబాగా ఉంటుంది.

— వి. వెంకటరమణ





# ఆకసాన తారివిట్లవిరిస్తే



డా॥ ముక్తేవి - భారతి

"ఊరో... వెళ్ళు."

"వెళ నండి..."

"అంటే "

"మీరు అన్నం తినేవరకూ ఇక్కడే నిలబడమన్నారండి. ఈ సీసాలో నీళ్ళు గ్లాసులో నన్నే పొయ్యమన్నారండి- ఆపిల పండు కోసి పళ్ళెంలో పెట్టమన్నారండి- మరేమో–" రంగయ్య మూడు గిన్నెల కారియర్ పక్కన పెట్టి, బుట్టలోవస్తువులు బయటకు తీస్తూ చెప్తున్నాడు

"చాల్లే ఆపు సీసాలో నీళ్ళు నేనుగ్లాసులో పోసుకోలేనా? ఫో నే పిలిచే వరకూ రాకు. అమ్మకి చెప్తావో చూసుకో- వెళ్ళు" కసిరాడు రవి రంగయ్య కదిలాడు గేటు దగ్గర బీడీ కాలుస్తూ కూచున్నాడు నిజానికి యిదే బావుంది 'యాపిల్ కొరుక్కు తినలేవా' నవ్వాడు విజయ్ రవి మాటా డలేదు

అవును ఎందుకు కొరుక్కు తినలేడూ తినని తిననిస్తేగా. అసలీ మూడు గిన్నెల కారియర్ ఏమిటి- బోర్ హాయిగా చిన్న టిఫిన్ బాక్స్ తెచ్చుకుంటే గబగబా తినేసి ఆడుకోవచ్చు పనిమనిషి ఓ గిన్నె ఇందులోది పారేస్తే ఎంత బావుంటుంది. ఛ, ఏమిటో- ఆ కారియర్‌లోది ఏదీ తినాలనిపించలేదు ఆ రోజు రవికి- కాస్త కాస్త తిని వెన్నెదిగా దూరంగా వున్న చెత్త బుట్టలో పోసేశాడు.

లంచ్ టైము అయేసరికి మూడు గిన్నెల కారియర్ సర్ది, బుట్టలో సీసాతో నీళ్ళు, ఓ మూల ఏదో ఒక పండు, ఒక్కో సారి ఏదన్నా స్వీటు, లేకపోతే కాడ్బరీ చాక్లెట్లు, ఇలా బుట్ట నిండుగా పంపడం రాధారాణికి అలవాటు. అవన్నీ తినేలా చూడ్డానికి రంగయ్య పక్కన నుంచోవాలి.

ఈమధ్య రవి ఒక ఉపాయంకని పెట్టాడు, రంగయ్యని దగ్గర నుంచోకుండా పొమ్మనడం.

విజయ్ టిఫిన్ బాక్సు, రవి కారియర్ మూతలు తీసి ఎవరికిష్టమైనవి వాళ్ళు తినడం మొదలుపెట్టారు. ఇద్దరికీ ఎక్కువై మిగిలినవి చెత్తబుట్టలో గుమ్మరించి ఒట్టి కారియర్ రంగయ్య చేతికియ్యడం అలవాటయి పోయింది రవికి.

గేటు దగ్గర కూచుని బీడీ కాలుస్తున్నా, అమ్మగారి పురమాయింపు గుర్తుంది రంగయ్యకి!

కారియర్ ఓ మూలపెట్టి "ఇయ్యాల చినబాబుగోరు పెరుగన్నం తినవని పేచీ పెట్టారండి నేను బతిమాలి తినిపించా నండి" అంటాడు అమ్మగారికేసి చూస్తూ.

"మంచిపని చేశావు" మెచ్చుకుంటుంది రాధారాణి

మరో రోజు "చినబాబుగోరు ఆపిలు ముక్కలు కొయ్యద్దు అంటారండి..."

"వాడికేమి వస్తుంది పండు కొయ్యటం— వేలు కోసుకుంటే!"

"అదేనండి...ఇనరండి— పైగా ఆ బాబు గోరి దోస్తండి—ఆపిలు కొయ్యకూడదటండి -- కొరుక్కు తినాలట."

"ఇంతకీ తిన్నాడా–ఆ దోస్తుకి పెట్టేశాడా ? "

"అమ్మా! నేను లేనటండి— అంతా మన బాబే తినేలా, ఆ దోస్తు తినకుండా అడ నిలబడ్డానండి..." ఇలా రంగయ్య చెప్తుంటే రాధారాణికి ఆనందంగానే వుంది. కాని మధ్యలో రంగయ్య "ఆ మూడు గిన్నెల్లో అన్నం బాబే తినేశారండి" అన్నాడు.

"ఊరుకో, అన్నమా నం - మూడు గిన్నెలు, మూడుగిన్నెలు అనకు — కారియర్ అను చాలు" విసుక్కుంది రంగయ్యపై రాధారాణి.

ఈ రంగయ్య దగ్గర నిలబడి తినేట్టు చేస్తున్నాడు కనక పిల్లాడు ఒక్కరవ్వ బాగున్నాడు - నిజానికి ఈ రంగయ్య మధ్య దారిలో కారియర్ తెరిచి తింటేనో! అనే అనుమానం మొదట్లో రాధారాణికి కలగక పోలేదు!! ఊఁ ఏదో ఒకటి - రంగయ్య మంచి వాడే, పిల్లల వాడు అని సద్దుకుంది మనసులో

షాపింగ్ పూర్తి చేసుకుని స్కూలు ముందు ఆగింది రాధారాణి ఆ రోజు. లోపల కాంపౌండులో పిల్లలు కొందరు సందడిగా అటు ఇటు తిరుగుతున్నారు. ఇంకొందరు ఆడుకుంటున్నారు. కొందరు పిల్లలు

## గమనిక

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు తిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది.

సం.





## ఆకసాన హరివిల్లు విరిస్తే...

గుంపులు గుంపులుగా కూచుని లంచ్ తింటున్నారు. చెట్టు కింద కూచుని నవ్వుతున్న రవి, ఎదురుగా మరో అబ్బాయి కనిపించారు రాధారాణికి. అక్కడే అలాగే నిలబడిపోయింది. గిన్నెలో పాయసం పక్కవాడి టిఫిన్ బాక్సులో కొంతపోసి, కొంత ఆ గిన్నెతోనే తాగుతున్నాడు రవి. రాధారాణి పంపిన చిన్నగ్లాసు బుట్టలోనే వుంది. "ఛీ ఏమిటా తాగడం" గొంతుపైకి తేవబోయింది. వెంటనే నోటికి చెయ్యడ్డం పెట్టుకుంది.

కారియర్‌లో మిగిలిన అన్నం, కూర, మిగిలిన పాయసం అన్నీ కలిపి ఓ గిన్నెలోపోసి చెత్తబుట్టలో దిమ్మరించివచ్చాడు రవి. రాధారాణి ఒళ్ళు మండిపోతోంది. ఇద్దరూ నీళ్ళపంపు దగ్గరకెళ్లి నీళ్ళు తాగారు రవి బూట్లు తడిసిపోయాయి "తను ఫ్రిజ్‌లో నీళ్ళు సీసాలో పోసినవి ఏమయ్యాయి" రాధారాణి పళ్ళు కొరుక్కుంది కోపంగా. బుట్టలోంచి కాటబరీ తీసాడు రవి. సగం తుంచి పక్కవాడి చేతిలో పెట్టాడు. ఇంతలో మరో కుర్రాడు పరుగెత్తుకుంటూ వచ్చి పల్లీలు రవి చేతినిండా పోశాడు. కాటబరీ ముక్క ఆ పిల్లాడి నోట్లో పెట్టాడు రవి. రాధారాణి కళ్ళు నిప్పులు కురిశాయి. రంగయ్య ఏమయినట్టు? రంగయ్య చెట్టుకింద కునికిపాట్లు పడుతున్నాడు. ఇంక అక్కడ క్షణం నిలవబుద్ధి పుట్టలేదు రాధారాణికి. మరు నిముషంలో కారు స్టార్టయింది. ఛా, వీణ్ణి స్కూలయినా మార్పించాలి లేకపోతే ఈ స్నేహాలయినా మాన్పించాలి. పంపుదగ్గర నీళ్ళు తాగటం, పల్లీలు తినటం, తను పంపే ఖరీదయిన పదార్థాలన్నీ అందరికీ పంచి పెట్టడం. పిల్లాడిని ఎంత ప్రత్యేకంగా పెంచాలనుకుందో వాడంత యిదిగా తయారవుతున్నాడు. దీర్ఘంగా నిట్టూర్చింది రాధారాణి!

ఉన్నట్టుండి రాధారాణికి ఓ మంచి ఆలోచన వచ్చింది. ఫస్టురాంక్ అబ్బాయితో వీడికి స్నేహం చేయించాలి — చదువన్నా వస్తుంది. ఎన్నెన్ని ట్యూషన్లు పెట్టించింది? అయితే మాత్రం ఇరవై రాంక్‌కి తక్కువ ఎప్పుడూ రాదే—చూద్దాం—రాధారాణి పరిపరివిధాల ఆలోచించింది. ఆ సాయంత్రం భర్తతో ఈ విషయం మాట్లాడింది.

"స్కూలుకి వెళ్ళే పిల్లాడు పల్లీలా

తినక, గోళీలు ఆడక ఏంచేస్తాడూ? అసలు నువ్వెందుకెళ్ళావ్'' రాధారాణి భర్త ఒక్క నిముషంలో ఆ విషయం తేల్చేసి పేపరు తిరగేయటం మొదలు పెట్టాడు.

* * *

ఆ పెద్ద హాలు, సోఫాలు, గోడల పెయింటింగ్స్ చూసి విస్తుపోయాడు విజయ్. ఇలాటవి కొనమని డాడీకి రాయాలి అనుకున్నాడు మనసులో! 'కూచో' రవి సోఫా చూపించాడు. ''మమ్మీ మా ఫ్రెండు వచ్చాడు'' గదిలోకి పరిగెత్తాడు రవి హాల్లోకి వొచ్చి చూసి ''హలో'' అంది వెంటనే. తెల్లని యూనిఫాం, పాలిష్‌తో ధగధగలాడే బూట్లు, పాలువెన్నతో నిగనిగలాడే బుగ్గలు — విజయ్ ముద్దుముద్దుగా ఉన్నాడు. కానీ ఆనాడు వీడి గిన్నెలో పాయసం తాగింది, బహుశా రోజూ వీడి యాపిల్ తింటున్నదీ, కేడ్బరీ తింటున్నది వీడేనా — ఏ బీద పిల్లాడో రవిని కబుర్లతో మోసంచేసి, బెదిరించి తను పంపించేవన్నీ తినేస్తున్నాడనుకుంటోంది — కాఫీ ఏమిటో...రాధారాణిలోపలకొచ్చి ఇద్దరికీ బిస్కట్లు, కాఫీ పంపింది.

రాధారాణి వచ్చి సోఫాలో కూచుంది. విజయ్‌ని చూస్తోంది—తను పంపే ఖరీదయిన తిండి వీడేతిని ఇలా నిగనిగలాడుతున్నాడన్న మాట —

ఫోన్ మోగింది— రవి లోపల కెళ్ళాడు — అంతలోనేవచ్చి ''వీడు ఎప్పుడూ ఫస్టురాంక్ వస్తాడు మమ్మీ!''

''వేణు కిందటేడు కూడా ఎప్పుడూ ఫస్టురాంక్‌లోనే వచ్చాననండి'' రాధారాణి ఏమీ పట్టించుకోలేదు.

''అవునబ్బాయ్. మీ బళ్ళో ఎవరి లంచ్ బాక్సులు వారు తెచ్చుకోరా.''

''తెచ్చుకుంటామండీ'' వెంటనేఅన్నాడు.

''మరి మావాడి కారియర్‌లోవి ఎవరికో ఒకళ్ళకి పెట్టేస్తుంటాడుట కదా'' రాధారాణి మాట పూర్తికాలేదు.

''నేను వీడికేం పెట్టడం లేదు, నేనే తింటున్నాను'' అన్నాడు వెంటనే రవి. రాధారాణి నవ్వింది. విజయ్ ముఖం ముడుచుకున్నాడు. ఈ మాటలు మహా చిరాగ్గా అనిపించాయి రవికి. లోపలికెళ్ళిపోయాడు. ఏన్నెన్నో ప్రశ్నలు వేసింది రాధారాణి విజయ్‌ని.

విజయ్ నడుస్తున్నాడు. ఫ్రిజ్‌లోంచి యాపిల్ తీసి చొక్కాకింద దాచుకుని గబగబా వీధిలోనికి నడిచాడు రవి. 'ఇది తీసుకో' రవి బలవంతంచేసి విజయ్ సంచిలో పడేశాడు. విజయ్ వెళ్ళిపోయాడు.

ఆ రోజు విజయ్ ఇంటికి తను వెళ్ళినపుడు విజయ్ నానమ్మ తనకి యాపిల్ జూస్ యియ్యలేదూ. ఎంతోసేపు నేను, విజయ్ కారమ్స్ ఆడుకోలేదూ మరి ఈ రోజు విజయ్ వస్తే వాడికి యాపిల్ ఇయ్యటానికి తనెందుకంత భయపడుతున్నాడు. కొంచం సేపు క్రికెట్ ఆడుకుందామనికూడా అనుకున్నాడు. కానీ అమ్మకి కోపం వస్తుంది స్కూలు నుంచి రాగానే ఆడుకుంటే. తను వాళ్ళింట్లో అన్ని గదులు తిరిగి కబుర్లుచెప్పి వచ్చాడు. ఈ రోజు విజయ్‌ని ముందుగది నుంచే పంపించేశాడే! అమ్మకి ఇలాటివి ఏమీ ఇష్టం వుండవు. స్నేహితులు ఎవరూ ఇంటికి రాకూడదు. ఎవరిళ్ళకి తను వెళ్ళకూడదు. అందుకేగా అమ్మతో అబద్ధంచెప్పి ప్రయివేటు క్లాసుందని తను విజయ్ ఇంటికి వెళ్ళింది! రవికి తల్లిమీద చాలా కోపమొచ్చింది.

రవి ఇంట్లో అడుగు పెట్టగానే అడిగింది రాధారాణి—

''రవీ-మీ ఫ్రెండు నాన్న ఏంచేస్తాడు''

''ఏమో''

''వాళ్ళ అమ్మ''

''ఆ...ఇంజనీరు''

''ఏమిటీ-ఇంజనీరా'' నవ్వింది రాధారాణి.

''ఏమో నాకు తెలీదు.''

''నాకు చెప్పాడులే — వాళ్ళ నాన్నేమొ... వాళ్ళమ్మేమొ యల్. సి. ఇ పాసయి ఉద్యోగం చేస్తోందిట. వీడు, అమ్మ వాళ్ళ మావయ్య దగ్గరుంటున్నారుట వింటున్నావా.''

రవి బొమ్మల పుస్తకంలోంచి తలెత్తాడు. వాడికి తల్లి మాటలేవీ పట్టలేదు మనసుకి 'స్టేట్సులో ఉంటున్నారట వాళ్ళనాన్న' కాదొంగకబుర్లు. మొగుడొదిలేసి ఉంటాడు. తల్లీ కొడుకూ మేనమామ దగ్గర పడిఉన్నారంతే రాధారాణి తనలోతాను అనుకుంటూ సోఫాలోంచి లేచింది ఆరోజు పాయసం తాగిన విజయ్ రూపం మాత్రమే ఆమె కళ్ళకి కనిపిస్తూ క్షణక్షణం వాడిమీద దురభిప్రాయాన్ని పెంచింది.

స్కూలుకి సెలవలిచ్చేశారు. రెండురోజుల తర్వాత రవి పుట్టినరోజు. ముందే చెప్పింది ''వాడింటికెళ్ళి వాణ్ణిపిలుచుకు రానక్కర్లేదు'' అని రాధారాణి— ముచ్చటలతో, స్నేహితులతో పుట్టినరోజు బాగా గడిచినా విజయ్‌ని పిలిస్తే బావుండేదని చాలాసార్లు అనుకున్నాడు రవి మనసులో!

రాత్రి భోజనాలు చేస్తూ, కబుర్లు చెప్పుకుంటుంటే గుర్తొచ్చింది ఇందిర రాలేనని ఫోన్ చేసిన విషయం! ''ఇందిర రాత్రి ట్రెయిన్‌లో ఊరెడుతోంది — రాలేనని ఫోన్ చేసింది'' రాధారాణి భర్తకేసి చూసింది.

''నన్నేంచేయమంటావ్?''



# ఆకసాన హరివిల్లు విరిస్తే...

"మిమ్మల్నేమీ చెయ్యమనను. ఈ సీట్లు అవి దానికి రంగయ్యచేత పంపించాలని" రాధా రాణి అంటూనే లోపలికెళ్ళింది. రంగయ్యని కేకేసి ఇంకోరింటికి పంపింది.

*　　*　　*

సెలవల్లో మద్రాసు వెళ్ళి వచ్చాడు రవి. ఇన్ని రోజుల తర్వాత స్కూలుకి వెళ్ళాలంటే భలే సరదాగా వుంది. ఇంచుమించు నెలా పది హేను రోజులు దాటి పోయింది. ఈ రోజే స్కూలు తెరిచారు.

"ఒరేయ్ రవీ కారియర్ ఏదిరా. ఆ రోజు స్కూలు నించి తెచ్చావా అసలు" వంటింట్లోంచి కేక పెట్టింది తల్లి.

"ఆ" రవి పుస్తకాలు సర్దుతూ.

"గుర్తు తెచ్చుకో."

"ఆ రోజు రంగయ్య జ్వరమొచ్చి రాలేదు. నేనే తీసుకెళ్ళాను తీసుకొచ్చాను." రాధా రాణికి నమ్మకం కుదరలేదు వీడు స్కూల్లో మరిచిపోయి వుంటాడు లేకపోతే—

"ఒకవేళ వాడేమన్నా"

"ఎవడమ్మా"

"నీ ఫ్రెండురా"

"ఛీ వాడికెందుకు. అయినా వాడికి చిన్న టిఫిన్ బాక్సు ఉందిగా. వాడు చాలా మంచి వాడమ్మా."

"మంచివాడే. ఆ రోజే అనుకున్నాను వాడి నాన్న స్టేట్సులో ఉన్నాడన్నప్పుడే. ఇలాంటి వాళ్ళు చాలామంది ఉంటార లే నీకేం తెలుసు" రాధారాణి విజయ్‌ని దొంగగా నిరూపిస్తుంటే రవికి ఎక్కడలేని కోపం వచ్చింది.

*　　*　　*

స్కూళ్ళ ఆయాలతో, టీచర్లతో మాట్లాడి రాధారాణి తిన్నగా పిల్లలున్న చోటికి వచ్చింది. పిల్లలంతా చుట్టూ మూగారు, విజయ్ గట్టిగా మాట్లాడుతున్నాడు. కొందరు పిల్లలు రవికేసిచూస్తూ గుసగుసలు చెప్పుకుంటుంటే రవికి చాలా సిగ్గనిపించింది. ఆ నిముషంలో అమ్మంటే అసహ్యం కలిగింది. రాధారాణి కారు స్టార్టు చేసి వెళ్ళిపోయింది. హమ్మయ్య అనుకున్నాడు రవి.

క్లాసులో విజయ్ తనని చూడనట్టే ఊరుకున్నాడు అమ్మ చెప్పింది నిజమేనేమొ అనిపించింది ఓ క్షణం రవికి.

## స్నేహం!

సృష్టిలో –
తీయనిది స్నేహం!
మనిషికి -
తీరనిది [illegible]!

లేదా!

పడచుదనం
బుసకొట్టే కాలనాగు.
ముసలితనం
నీరులేని చిన్నవాగు

విడని బంధం!

స్త్రీకి పురుషుడు
తోడు నీడ!
పురుషుడికి స్త్రీ
వెన్నెలవాడ!

- పాయసం సుబ్రహ్మణ్యం

"నిజంగా నేను తీయలెదురా" అని చెప్పడేం మరి? అమ్మ మాటలు రవి మనసులో ప్రతిధ్వనించాయి. ఆరోజు ఐదు రూపాయలు పుస్తకంలోంచి కిందపడి పోయాయి. ఎక్కడో పడిపోయాయనుకున్నాడు. అవి విజయ్ కాజేశాడేమొ!! మామయ్య తెచ్చిన ఫారిన్ పెన్ అమ్మ వద్దంటున్నా స్కూలుకి తెచ్చాడు. ఆరోజె అది పోయింది ఇదీ విజయ్... రవి పుస్తకం మూసేసి విజయ్ ముఖంలోకి చూశాడు. విజయ్ పుస్తకంలోకి దీక్షగా చూస్తున్నాడు. రోజూ వీడికి నా భోజనం, నా కాటబరీసు— ఎన్నెన్ని పెట్టాను ఎక్కడో దాగివున్న అహం ఒక్కసారి తలెత్తింది. ఓ నిముషం!!

రోజూ మామూలుగా ఒకళ్ళ పక్కన ఒకళ్ళు కూచుని లంచ్ తింటున్నా ఏదో నిశ్శబ్దం ఇద్దరిమధ్య. నిర్మలమైన ఇద్దరి మనసుల్లోనూ కలత చెలరేగుతోంది.. అద్దం లాంటి ఇద్దరి మనసులూ మసక చెందుతున్నాయి. "వీడి కారియర్ నాకో లెక్కా! మా నాన్నకి ఒక్క ఉత్తరం రాస్తే ఇలాంటి కారియరు వందలు కొనగల డబ్బు పంపగలడు. ఈఏడాది గడిస్తే నేను, మమ్మీ

అక్కడికి కెళ్ళిపోతామే హాయిగా'' అను కున్నాడు విజయ్.

"వాడి పిచ్చి టిఫిన్ బాక్సు బాగాలేదని వాడి కొట్టేమంటాడు. మళ్ళా నేను మూస్తా నేమోనని, అమ్మ చెప్పినట్టుగా అమ్మేమంటాడు. వీడి అమ్మ ఇంజనీరు, వీడినాన్న స్టేట్సులో ఉండటం, వీడు ఓ ఏడాదిలో ఫారిన్ వెళ్ళిపోడం, అన్నీ అన్నీ అబద్ధాలే అయి వుంటాయి'' అనుకున్నాడు రవి.

లోపలలోపల అనుకుంటూనే పక్క పక్కనే కూచుంటున్నారు క్లాసులో. పక్క పక్కనే కూచుని లంచ్ తింటున్నారు. రోజులు గడిచిపోతున్నాయి.

* * *

ఆ రాత్రి భోజనాలు చేస్తున్నారు రవి, తల్లి, తండ్రి. లేడీస్ క్లబ్బు విశేషాలు చెపుతోంది రాధారాణి ఉత్సాహంగా. కాలింగ్ బెల్ మోగడంతో రంగయ్య తలుపుతెరిచాడు.

"హాయ్- ఏమ్మిటు రావటం'' రాధారాణి కుర్చీ చూపించింది.

"నిన్ననే వచ్చా... చూసారా- మీరు పంపిన స్వీట్సు తినేశాం... మీ వస్తువు పంపించటం మరిచిపోయాం. అమ్మనివెంటనే మీకు పంపేయమన్నాను. అమ్మో ఆవిషయమే మర్చిపోయింది. ఒక్కోసారి తమాషాగా మర్చిపోతాం కదూ'' ఇందిర గలగలా మాట్లాడుతూ బుట్టలోంచి తీసి పైన పెట్టింది.

రాధారాణి గుండె ఆగినంత పనైంది.

అన్నం కలపడం ఆపేసి మూర్తి భార్య కేసి చూశాడు.

రెప్ప వాల్చకుండా అలా చూస్తూ ఉండిపోయాడు రవి.

ధగధగా మెరుస్తున్న మూడు గిన్నెల కారియర్!!

"అదేమిట్రా అంత విస్తుపోతున్నారు - అది మీదే-ఆరోజు నాకు స్వీట్సు పంపలేదూ'' ఇందిర మాటలేవీ వినిపించటంలేదు రాధారాణికి. ఏదో చెప్పాలని నోరు తెరిచి, తల్లి కళ్ళని చూసి వెంటనే నోరు మూసేసు కున్నాడు రవి.

* * *

ఆరోజు వింతో ఉత్సాహంగా వుంది రవికి. స్కూలుకి రోజుకన్నా చాలా ముందు వచ్చేసాడు. స్కూల్లోకి అడుగు పెడుతున్న విజయ్‌కి ఎదురెళ్ళాడు.

"ఒరేయ్ మా కారియర్ దొరికిందిరా - మా ఇందిర అత్తయ్య...''ఏదో ఉత్సాహంగా రవి చెప్తుంటే, వినిపించుకోకుండా ముందుకి నడిచాడు విజయ్.

పక్కన కూచుని "ఆ రోజు మా అమ్మ నిన్ను'' చెప్పబోయాడు రవి. "ఏ రేసే'' విజయ్ నోట్సు రాసుకుంటూ తలెత్తలేదు.

"ఎలా దొరికిందిరా - మీ అమ్మ నన్ను దొంగ అందిరా'' అంటూ ఏమీ అనకపోయే సరికి, రవికి భోరున ఏడ్వాలనిపించింది.

ఇంక ఈ విజయ్‌కి,నాకు స్నేహం ఉండదు. రవి రహస్యంగా కళ్ళొత్తుకున్నాడు పుస్తకంలో తల దాచుకుని.

యధాప్రకారంగా లంచ్ టైము అయింది. విజయ్ టిఫిన్ బాక్సు తెరిచాడు. రవి కారియర్ తెరవలేదు. కొన్ని నిముషాలు గడిచాయి.

'తిను' విజయ్ రవికేసి చూసాడు.

రవిమాట్లాడలేదు. విజయ్ మళ్ళీమాట్లాడించలేదు. అంతే- లంచ్ బెల్ అయిపోయింది. ఎవరి చోటో వారుకూచున్నారు. విరిగిన గాజుముక్కలు అతకడం కష్టం. ఆ రోజు నిండుగా ఉన్న కారియర్ వెనక్కి తీసు కెళ్ళాడు రంగయ్య! ఆకసాన హరివిల్లు విరిస్తే అది మాకేనని ఆనందించే పసి మనసుల్ని తేలిగ్గా దూరం చేసేయగల రాధారాణు లెందరో మరి!! ఇదేం తెలుసు రవికి!! ఆ రోజు మంచి 'లంచ్ బెల్' ఇద్దరినీ మరీ దూరం చేసింది.

ఆ రోజు స్కూలుకి వెళ్ళే టైమవుతుంటే యధాప్రకారం కారియర్ సర్దింది. బుట్ట నిండుగా వుంది. పైన చిన్న అందమైన నాప్‌కిన్ కప్పింది. కాని ఆ కారియర్ స్కూలు ఆవరణలో అడుగుపెట్టే భాగ్యం ఆ నిముషంలోనే కోల్పోయింది.

వంటింట్లో కొచ్చాడు రవి. మూలదాచిన చిన్న టిఫిన్ బాక్సు తీసుకున్నాడు. శుభ్రంగా కడుక్కుని, నాలుగు పూరీలు దాంట్లో సర్దుకున్నాడు. కాట్‌బరీ చేతో పట్టుకుని నిలబడ్డ రాధారాణి కొడుకుని చూస్తూ,

"అదేమిటి'' అంది ఆశ్చర్యంగా.

అంతే- "స్కూల్లో ఏం తినాలో నాకు తెలుసు మమ్మీ'' చకచకా నడిచి ముందుకెళ్ళిపోతున్న కొడుకుని చూస్తూ అలానే నిలబడి పోయింది.

మూడు గిన్నెల కారియర్, ఫ్లాస్కు, యాపిల్, కాటబరీ- అన్నీ, అన్నీ బుట్టలోంచి తొంగి తొంగి తన్నే చూసి నవ్వుతున్నట్టనిపించిందాక్షణంలో రాధారాణికి. పేపరులో ముఖం దాచుకుని భర్త నవ్వుతుంటే,సోఫాలో కూలబడింది !!



# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## డాక్టర్ రావూరి భరద్వాజ :

మూడు దశాబ్దాల నాటి మాట. ఏకంగా ముప్పయి కథల సంపుటాలు, ఆంధ్రప్రభకు సమీక్ష కోసం వచ్చాయి. వాటిని సమీక్షించే బాధ్యతా భారం నాపై పడింది. చదువుదును గదా— అన్నీ కామకలాపాల కథలు. అయోని, వియోని, అన్యయోని సంబంధాల కథలూ ఉన్నాయి. చదివినకొద్దీ చవులూరిస్తున్నాయి. అదివరకు అవి రేరాణి, అభిసారిక వంటి పత్రికలలో ప్రచురితాలే. రచయిత కూడా నాకేకాక, సమకాలిక తెలుగు రచయితలందరికీ తెలిసినవారే. శ్రీ రావూరి భరద్వాజ. కాని వాటిపై వెంటనే సమీక్ష ప్రచురించడం సాధ్యంకాలేదు. కారణం అవి పరోక్షంగా కామ ప్రవృత్తిని పాఠకులలో ప్రవర్తింపజేస్తాయి కాబట్టి, అలాటివాటిని ప్రోత్సహించడం ఆంధ్రప్రభ విధానం కాదని సంపాదకులు భావించారు కనుక. ఎన్నో వడపోతలతో సమీక్ష ఎట్టకేలకు ప్రచురితమయింది. ఆనాటి నుంచి భరద్వాజ పాత్రలు నా మనస్సులో మెదులుతూనే ఉన్నాయి. ఖ్వాజా అహమద్ అబ్బాస్ అన్నట్టు జీవనపు లోతులకు పాతాళగరుడిలాగ పరుగులువారే నిశిత గంభీర దృష్టి, పాత్ర చిత్రణలో చివుళ్లు తొడిగే శిల్పం, సన్నివేశాలను, స్థలాలను ఎన్నుకోవడంలో కనిపించే అపూర్వ కౌశలం భరద్వాజ లేఖినికి వెన్నతో పెట్టిన చక్కని విద్య. భరద్వాజ లేఖిని ఒకప్పుడు పరుగులు ప్రవర్తిస్తుంది. మరొకప్పుడు లావణ్యాలు ఒలికిస్తుంది. పాత్రోచితంగా ప్రవర్తిస్తుంది. దీనికి కారణం ఆయన మీసకట్టు కూడ మొలవని ప్రాయంలో జీవన సమరంలో దూకి, చేరెడు గింజకీ, మూరెడు గుడ్డకూ పాటుపడినవాడు కావడం. పాటు విలువ పూర్తిగా గుర్తించినవాడు కావడమూను. భరద్వాజ కృష్ణాజిల్లాలో నిజాం పరగణాన పరిటాలలోని మొగులూరు గ్రామంలో 1927 జూలై ఐదవ తేదీన జన్మించారు. గుంటూరుజిల్లా తాడికొండలో ఎనిమిదవ తరగతి వరకూ చదివారు. అంతటితోనే ఆగిపోయింది ఆయన బడి చదువు. జ్యేష్ఠ కుమారుడు కావడం వల్ల కుటుంబాన్ని ఆదుకోవలసి వచ్చింది 15వ ఏటనే. పొలంలో, ఫ్యాక్టరీలో, ముద్రణాలయంలో, అనాథ శరణాలయంలో— ఇలా ఎన్నోచోట్ల పని చేశారు. ఏ పని చేసినా, శ్రద్ధగాను చేశారు. దాని లోతులను చూచారు. ఆ లోతులలో తన మనసును, బుద్ధిని అభివృద్ధిపరచుకున్నారు. తీరిక సమయాలలోనే చేతికి దొరికినదల్లా చదివారు. మెదడులోని మారుమూలల అరలలోకి తోశారు. ఆ అనుభవ సంపద ఉత్తరోత్తరా సాహిత్యానికి పెద్ద మదుపవుతుందని ఆయన కూడ ఊహించి ఉండరు. 1946లో నెల్లూరులో యువజన శిక్షణ శిబిరానికి వెళ్లడం తటస్థించింది. దానితో ప్రారంభమయింది ఆయన వాస్తవ జీవితం, గతానుభవమంతా బంగారు పంట పండడానికి. వెంకటరామానాయుడు గారి జమీన్‌రైతు వారపత్రికలో చేరారు. సంవత్సరం తిరిగీ తిరగంగానే రచయితగా స్థిరపడ్డారు. 'దీనబంధు' వారపత్రిక నిర్వాహక బాధ్యతను స్వీకరించారు. పిదప జ్యోతి, రేరాణి, అభిసారిక, సమీక్ష, చిత్రసీమ, యువ మాసపత్రికలలో దాదాపు పదేళ్లపాటు పనిచేసి పుంఖానుపుంఖంగా కథలు, వ్యాసాలు, నాటికలు, నాటకాలు, నవలలు వ్రాశారు. ప్రారంభంలో కొంత చలంగారి పరవడిలో నడిచినా, పిదప తమ దారిలోనే నడిచారు, జనాన్ని చదివారు, మనాన్ని మథించారు. గనుక ఒకరి దారి తమకెందుకూ? ప్రముఖ రచయిత, మానవతావాది త్రిపురనేని గోపీచంద్ ప్రోత్సాహంతో ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో 1959లో జూనియర్ స్క్రిప్ట్ రైటర్‌గా చేరి, 1975లో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్ అయ్యారు. 1968లో ఉత్తమ కథకుడుగా ఆయనకు రాష్ట్ర సాహిత్య అకాడమీ బహుమతి ఇచ్చింది. 1980లో ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదంతో గౌరవించింది. భరద్వాజ ఇంతవరకు 116 పుస్తకాలు రచించి ప్రచురించారు. వాటిలో 37 కథా సంపుటాలు, 17 నవలలు, ఆరు చిన్నపిల్లల నవలలు, ఐదు పిల్లల కథా సంపుటాలు, మూడు వ్యాస సంపుటాలు, ఎనిమిది నాటకాలు మొదలైనవి ఉన్నాయి. ఈయన కథలు కొన్ని ఆంగ్ల, హిందీ, బెంగాలీ, కన్నడ, తమిళ, ఉరుదూ, మలయాళ భాషలలోకి అనువదించబడినవి. ఆంగ్లంలో రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. ఈయన రచనలు ఒక చిన్న ప్రపంచం. వివిధ వృత్తులవారు, ప్రవృత్తులవారూ కనిపిస్తారు స్వస్వరూపంతో. ఈయన నవలలలో కాదంబరి, పాకుడురాళ్లు గొప్పవిగా గణనకెక్కాయి. ఈ సంవత్సరం వెలువడిన తాజా రచన జీవనసమరం. జీవనసమరంలో ఇంతకాలం నిలబడి విజేత అయిన వారు గనుక భరద్వాజ వ్యర్థ జీవుల యథార్థ గాథలను ఆశ్చర్యకరంగా చిత్రించారు. భరద్వాజ అనుభవం పండి, విజ్ఞానం నిండారినవారు గనుక నిరాడంబరులు, మధుర భాషణులు. "మానవజాతి సుఖశాంతులతో మనుగడ సాగించాలి. నా చుట్టూ ఉన్న ప్రపంచం ఆస్తులకోసం, ఆడువారి కోసం పోట్లాడడం చూస్తుంటే సిగ్గవుతుంది...., ఆకాశన్నంటే సౌధాల సరసన నేలమట్టమయిన పూరిగుడిసెలు, అన్నపూర్ణ అయిన మనదేశంలో ఆకలితో అలమటించే జనం—నాకు మరీ సిగ్గు, బాధ కలిగిస్తాయి" అంటారు భరద్వాజ. భరద్వాజ డైరీ నా దృష్టిలో చాల విలువైంది. దానిలో వివాదగ్రస్తంకాని విషయాలను ప్రచురిస్తే సమసామయిక సాహిత్య చరిత్ర అవుతుందని నా విశ్వాసం. మిత్రులు భరద్వాజ, ఆయన కలం మరి నూరేళ్లూ మనాలి, నేనూ చూడాలి.



డాక్టర్ భరద్వాజ

## శ్రీకృష్ణయ్యర్ విమర్శ :

సర్దార్ వల్లభాయి పటేల్ జాతీయ పోలీసు అకాడమీ నిర్వహించిన సదస్సులో డిసెంబరు 14న సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి శ్రీ వి. ఆర్. కృష్ణయ్యర్ ప్రసంగిస్తూ, మనదేశంలోని పత్రికలు వాస్తవాలను ప్రచురించడం లేదని విమర్శించారు. పరిశోధనాత్మక పత్రికా రచనకు మనదేశ పత్రికలు ప్రాధాన్యం ఇవ్వడం లేదని ఆయన అన్నారు. అపరాధ రహిత సమాజస్థాపన పోలీసు శాఖ, పత్రికల లక్ష్యమని, ఈ లక్ష్య సాధనకు పూనుకోకపోతే అవి దేశద్రోహం చేసినట్టేనని ఆయన గట్టిగా చెప్పారు.

## ఉపశ్రుతి :

రవీంద్రభారతి మహాద్వారానికి ఇరువైపులా పెట్టిన వీరగల్లులు తీసివేశారే. కారణం ఏమయి ఉంటుంది? అనడిగాడు ఒక జిజ్ఞాసువు నన్ను. నేను ఆలోచన మొదలు పెట్టాను. కళకు ప్రాణార్పించే వారు కరువైపోయి ఉంటారండీ. వీరగల్లులెందుకని తీసివేశారేమో! అన్నాడు మా సంభాషణ వింటున్న ఒక సామాన్య మానవుడు.

# ఉత్తరాలు

(4వ పేజీ తరువాయి)

## కథలు

25-12-81 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖచిత్రం నృత్య భంగిమలో నటి రాజ్యలక్ష్మి ఆకర్షణీయంగా ఉంది. "బిళ్ళలేని నల్లటోపి" పెద్దకథ ప్రారంభం బాగుంది. ఈ మధ్య ఎక్కువ కథలు ప్రచురిస్తున్నందుకు మా కృతజ్ఞతలు. బాబా సెందా లివ్వండి. బలిపీటం కథలు బాగున్నాయి.

వై. హేమసుందర్‌రావు, హేమబిందు
ప్రియ (ఛోర్నకల్)

* * *

25-12-81 తేదీ వార పత్రికలో ప్రచురితమైన "బలిపీటం" కథ చదివాక మనస్సు ఆర్ద్రమైంది. వరకట్నం నిర్మూలన ధ్యేయంగా పెట్టుకొని ఒక చక్కని కథ పాఠక లోకానికి అందించిన రచయిత అభినందనీయులు.

గేదెల విశ్వనాథం (ధనపురం)

## సీరియల్స్

25-12-81 వ తేదీ ముఖచిత్రం జి. రాజ్యలక్ష్మి ఎంతో ఆకర్షణీయంగా ఉంది. "తార" "జీవితవనంలో కొత్త గాలి" సీరియల్స్ రెండూ బాగున్నాయి. రచయిత్రులు ఇద్దరూ అభినందనీయులు.

ఆరిఫ్ (చింతలపూడి)

* * *

25-12-81 నాటి 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' ఆకర్షణీయంగా ఉంది. 'జీవిత వనంలో కొత్తగాలి' 'తార' రెండు సీరియల్స్ ఇంట్రస్టింగ్‌గా ఉన్నాయి.

వాకర్ల వెంకటేశ్వరరావు (మచిలీపట్నం)



## కొత్తరకం చరిత్ర పాఠాలు!

పశ్చిమ జర్మనీలో చరిత్రబోధన క్రొత్త పద్ధతులను సంతరించుకుంటున్నది. గడచిన చరిత్రకు సాక్షులుగా మిగిలిన తాతయ్యలు, అమ్మమ్మలు తరగతులకు వచ్చి ఆ నాటి సంఘటనలను ఒక్కొక్కటి వివరించి చెబుతున్నారు. కొన్ని తరగతులకు పాఠ్యాంశాల్లో మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలుండటంతో యీ తాతయ్యలు, అమ్మమ్మలు విద్యార్థులకు తమ అనుభవాలను జోడించి వాటిని వివరిస్తున్నారు. దీనివలన చరిత్రంటే అందనికథ కాదు, జీవితాల్లో పెనవేసుకున్న గాథ అనే సత్యం పిల్లలకు సులభంగా అర్థమౌతున్నది. అంతేగాక, చరిత్ర పాఠం వింటుంటే పిల్లలకు ఆవలింతలకు బదులు ఆసక్తి పెరుగుచున్నది

25-12-81 వ తేదీ పత్రిక ముఖచిత్రం ఎటువంటి ప్రత్యేకత లేక పోవడం నిరాశ చెందాము. "తార" సీరియల్ నవల వెరైటీగా ఉంది.

సి. రంగనాయకులు, పద్మావతి, కృష్ణవేణి,
ఇందిరా, శ్రీదేవి (ధర్మవరం)

* * *

జీవిత వనంలో కొత్తగాలి సీరియల్ చాలా బాగుంది కుందుర్తి ఇందిరాదేవిగారికి నా అభివందనములు శ్రీమతి రత్నగోపాల్ (సోంపేట)

* * *

అంబిక ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. జీవితవనంలో కొత్త గాలి సీరియల్ చాల ఇంటరెస్టుగా సాగుచున్నది.

ఎ. వి. రుక్మిణి. పి. పద్మ (టి. బి దానేం)

## మనవి

**ఉత్తరాలు రాసేవారు**

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలనీ,
* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలనీ,

మనవి చేసుకుంటున్నాము.

— సంపాదకుడు


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor . S. Radhakrishna.

